# వేమన గ్రంథమండలి

కుసుమం . 3



ప్రథమ ముద్రణ

౧౫-౬-౧౯౪౭

వెల : రూపాయి



ప్రాప్తిస్థానము

గ్రంథకర్త

తేలప్రోలు . కృష్ణా జిల్లా

## మనవి

ఒకానొకప్పుడు ప్రపంచమున కాదర్శముగ వెలుగొందిన భారత భూమి కీనాడు గలిగిన దౌర్భాగ్యస్థితికి తాత్విక, నైతిక, సాంఘిక ఆర్థిక, రాజకీయాదులలో మన విరుద్ధ ప్రవర్తనయే కారణమని నా విశ్వాసము. ఆ కారణములను సశాస్త్రీయముగ చూపించుటకే ఈ గ్రంథము వ్రాసితినిగాని, పాండిత్య ప్రకటనకుమాత్రము కాదని మనవి.

ఈ పుస్తకము సమాజోన్నతియం దభిలాష గలిగిన మహనీయుల ఆశీర్వాదములను పొందగలిగినను, విపరీత దృష్టితో తిలకించు ఛాందసుల శాపములకుగూడ గురిగాక తప్పదని యెరుగుదును. వారి వారి దృష్టి ననుసరించి అభిప్రాయములు గలుగుట మానవుని సహజ లక్షణమగుటచే, అట్టి సంకుచిత హృదయులను గురించి జాలిపడుట కన్నమన మేమి చేయగలము !

ఎవ్వరి మనస్సునుగాని నొప్పించవలయునను ఉద్దేశము లేదనియు కేవలము సమాజోన్నతిని దృష్టిలో పెట్టుకొనియే నే నీ గ్రంథమును వ్రాసితిననియు, సహృదయులగు సోదర సోదరీమణులకు మనవి జేయుచున్నాను.

ఈ గ్రంథరచనలో నాకు తోడ్పడిన మహనీయులకును, గ్రంథ కర్తలకును, వ్యాసకర్తలకును నా కృతజ్ఞతాంజలులు.

ఆరుమళ్ల సుబ్బారెడ్డి.

# కృతి సమర్పణము

నేనిటీవల తలవనితలంపుగా పశ్చిమగోదావరిజిల్లాలోని వల్లూరు గ్రామమునకు మిత్రులు శ్రీ ఘంటా సత్యన్నారాయణమూర్తిగారింటికి బోయితిని. ఆసమయములో శ్రీమంతులగు మల్లారెడ్డి బుల్లివెంకయ్య, శీతయ్యమ్మారావుగార్ల పుత్రరత్నమగు శ్రీరామమూర్తిగారి పరిచయభాగ్యము లభించినది. వారి ఆదరణకారణముగ మరికొన్నిరోజు లా గ్రామములో నుండుట తటస్థించినది. ఆ సందర్భమున నా యీ వ్యాసములను విని త్వరలో నిది గ్రంథరూపముగ వెలువడుటవసరమనియు, తా మీ వ్యయమును భరించెదమనియు ప్రోత్సాహపరచిరి. ఆశ్రయించియు నాదరణగాంచలేని ఈ కాలమున నయాచితముగ గ్రంథము ముద్రింపసంకల్పించిన శ్రీరామమూర్తిగారెంతయు ప్రశంసనీయులు. వారు సిద్ధసంకల్పులు. శ్రీరామమూర్తిగారికిని వారి సతీమణి శ్రీమతి జోగయ్యమ్మగారికిని కృతజ్ఞతాపూర్వకముగ నీ కృతిని సమర్పించుకొనుచున్నాను.

ఆరుమళ్ల సుబ్బారెడ్డి

# హిందూజాతి పతన కారణములు

## వర్ణభేదము

తాత్త్విక, సాంఘిక, ఆర్థిక, రాజకీయాదులలో ఒకప్పుడత్యున్నత స్థితియందున్న హిందూజాతి నేడింతటి పతనమొందుటకుగల కారణములను పరిశీలించుటకై ఈ గ్రంథము ప్రారంభింపబడుచున్నది. అందు ప్రథమమున సాంఘికముగా హిందూజాతి యెట్లు పతనమైనదను విషయ మీప్రకరణమునందు చర్చించుచున్నాము. వర్ణభేదమనునది హిందూదేశములోతప్ప ప్రపంచములో మరెచ్చటను కనిపించదు. "సమాన ధర్మములుగల జీవులొక జాతి" యని చెప్పబడును. మానవులందరు సమాన ధర్మములు గలవారగుటచే, ఒకే జాతిగా నిర్ణయింప వలసియున్నది. చాలకాలమువరకు మన భారతదేశములోకూడ అట్లే యున్నది. కాని ఉత్తరదేశమున నివశించెడివారు యజ్ఞయాగాది క్రతువుల నాచరించుటచే ఆర్యులనియు, క్రీడాదులతో ప్రొద్దుపుచ్చువారగుటచే దేవతలనియు, దక్షిణదేశమున నుండెడివారు ధన, బల సంపత్తులు గలవారగుటచే ద్రావిడులనియు, దేశ సంరక్షకులగుటచే రాక్షసులనియు, పిలువబడుచుండిరి.

ఆర్యులు దక్షిణాపథమును పూర్తిగ జయించిన తరువాత రాజ్యపాలన కనువగు విధమున వారి సంఘమును మూడు వర్గములుగ విభజించుకొనిరి. విజ్ఞాన పరిశోధనకు తగినవారిని బ్రాహ్మణులనియు, దేశరక్షణకు తగినవారిని క్షత్రియులనియు, కృషి గోరక్షణ వ్యాపారములకు తగిన వారిని వైశ్యులనియు, వారివారి గుణకర్మ స్వభావములను బట్టి మూడు వర్ణములుగ విభజింపబడినట్లు [1] గౌతమస్మృతిని బట్టి రుజువగుచున్నది. తమచే నోడింపబడి సేవకావృత్తి కంగీకరించిన ద్రావిడులను శూద్రులనియు, దాస్యమున కంగీకరించక పారిపోయినవారిని అస్పృశ్యులనియు, ఆర్యులు నిర్ణయించినట్లు చరిత్ర స్పష్టపరచుచున్నది. ఆర్యులు సంఘ శ్రేయస్సుకొరకు సమాజమును త్రివిధవర్గములుగ విభజించి నను, ఆహారవ్యవహార వివాహాదులలో మాత్రము భేదములు లేకయే కొంతకాలము సంచరించినట్లు కనిపించుచున్నది. ఇప్పటికిని ఉత్తరదేశములోని బ్రాహ్మణుల ఆచార వ్యవహారములు గాంచినచో ఈ విషయము బోధపడగలదు. నేటికిని వంగదేశీయ బ్రాహ్మణులు మాంసము తినెదరు. వారి గృహములలో స్పర్శదోషము లేదు. కాశ్మీరదేశపు బ్రాహ్మణుల యిండ్లలో తురకలు కార్యములు నిర్వహించెదరు. బొంబాయి యందు సారస్వత బ్రాహ్మణులు వైశ్యుల యిండ్లలో జలపానము జేసెదరు. నంబూద్రి బ్రాహ్మణులు క్షత్రియుల అన్నము తినెదరు. వారిలో

1 ఆర్యా స్త్రైవర్ణికాః.

జ్యేష్ఠుడు తప్ప తదితరులు నాయరు స్త్రీలతోనుందురు. పంజాబులోని గౌడసారస్వత బ్రాహ్మణులు హీనజాతిస్త్రీలను వివాహము జేసికొనెదరు. సింధు, రాజపుత్ర దేశములలోని బ్రాహ్మణులు మంగలివారి యిండ్లలో భోజనము చేసెదరు. మార్వాడ దేశీయులగు, చరణ బ్రాహ్మణులు రజపత స్త్రీలను వివాహము జేసికొనెదరు. నేపాళ బ్రాహ్మణులు శూద్రస్త్రీలను వివాహము జేసికొనెదరు. వారిలోని విధవలు వేశ్యలవలె ప్రవర్తించెదరు. ఒరిస్సా బ్రాహ్మణులు శూద్రులచేతి అన్నమును తినెదరు. చరిత్రనుబట్టి చూచినచో పూర్వము సమాజములో సమత్వమెల్లెడల కనిపించుచున్నది. మంగలి, కులమిత్రుడు, కృషికుడు, దాసుడు, మొదలగువారి అన్నమును బ్రాహ్మణుడు తినవచ్చునని వ్యాససంహిత, యాజ్ఞవల్క్య, మను, పరాశరస్మృతులయందు స్పష్టముగ నిరూపింపబడి యున్నది. అట్లుగానిచో వశిష్ఠుడు మాదిగ స్త్రీనిగాని, అతని కొడుకగుశక్తిమహర్షి మాలకన్యనుగాని, అట్లే శుక్రాచార్యుడు ఋష్యశృంగుడు, జమదగ్ని, ఋచీకుడు, అగస్త్యుడు, రైక్వుడు, సౌభరి మొదలగువారు క్షత్రియ స్త్రీలనుగాని, బ్రహ్మక్షత్రియ..., దేవయాని మొదలగు బ్రాహ్మణస్త్రీలు క్షత్రియులనుగాని, యెట్లు వివాహము చేసికొనగలుగుదురు? అరణ్యపర్వములో ధర్మరాజుతో వైశంపాయనునకు, నహుషునకు, యక్షునకు జరిగిన సంవాదములు పరిశీలించినచో, ఈ సత్యము స్పష్టముగ రుజువు కాగలదు. వారి వారి ప్రవర్తనలను బట్టియే, బ్రాహ్మణచండాలత్వములు గలుగును గాని, పుట్టుకనుబట్టి కాదని స్పష్టముగ రుజువు అగుచున్నది.

ఆ కారణముచేతనేకదా! లేడికి, నక్కకు, కుక్కకు, కుండేటికి, పుట్టకు, వేశ్యకు, చాకలికి, విధవకు, మాదిగకు, మాలకు, కప్పకు, గాడిదకు, పుట్టిన ఋష్యశృంగ, గౌతమ, శౌనక, వాల్మీక, అగస్త్య, వ్యాస, వశిష్ట, నారద, కౌండిల్య గార్గేయాదులు బ్రాహ్మణులు కాగలిగినది? క్షత్రియులైన విశ్వామిత్రుడు, ముద్గలుడు మొదలగువారు బ్రాహ్మణులైనట్లును, వారి వంశము లిప్పటికిని, విశ్వామిత్ర, మాద్గల్యగోత్రములతో వ్యవహరించుటయును, బ్రాహ్మణుల కెల్లరకు తెలియునుగదా? ఇంకను వీతహవ్యుడు, కణ్వుడు మొదలగు క్షత్రియులు బ్రాహ్మణులైనట్లు చరిత్ర రుజువు చేయుచున్నది. అట్లే నాభాగుడు, అరిష్టుడు, తులాధారుడు మొదలగు వైశ్యులును; బ్రాహ్మణులైనట్లు హరివంశమునం దున్నది. ఇంకను జానశ్రుతి మొదలగు శూద్రు లెందరో బ్రాహ్మణులైనట్లు, శ్రుతి, స్మృతులన్నియు తెలుపుచున్నవి. కావున గుణమునుబట్టియే వర్ణమును నిర్ణయించినట్లు కనిపించు చున్నదిగాని, పుట్టుకనుబట్టి వర్ణమని యేస్మృతికర్తకూడ నంగీకరించినట్లు లేదు. బ్రాహ్మణత్వమునకు సత్యధర్మాది వర్తనములే కారణములుగాని, ఉపనయనాది సంస్కారములు గాని, వేదాధ్యయనాదులుగాని కారణములుకావని భారతము స్పష్టపరచుచున్నది. మనుమహర్షియు, ఆపస్తంభసూత్రకారు డును ఈ సత్యమునే రుజువు చేయుచున్నారు. భగవద్గీతకూడ వారివారి గుణకర్మస్వభావముల ననుసరించియే వర్ణనిర్ణయము చేయబడినట్లు స్పష్టముగ రుజువగుచున్నది. గుణమునుబట్టి వర్ణమను సిద్ధాంతమునకు ప్రారంభములో విఘ్నములు

తెచ్చినవారు, బ్రాహ్మణ క్షత్రియవర్గములవారని స్పష్టపడు చున్నది. ఈ స్వార్థము పరశురాముని కాలములో అంకురించి నట్లు కనిపించుచున్నది. బ్రాహ్మణ క్షత్రియులలో అగ్ర వర్ణమువా రెవరనునది ఈ కలహమునకు మూలము. తగిన బలము లేనందుచే బెస్తలకు బ్రాహ్మణత్వమిచ్చి పరశు రాముడు స్వసంఘమును వృద్ధిచేసికొని క్షత్రియులతో ననేక పర్యాయములు యుద్ధములు చేసినట్లు కనిపించుచున్నది. వశిష్ఠ విశ్వామిత్రుల కలహములకుకూడ నిదియే కారణమని చరిత్ర స్పష్టపరచుచున్నది. కడకు బ్రాహ్మణులకు క్షత్రియులు లొంగిపోయి, తమ్ము రెండవ వర్ణముగా నంగీకరించినట్లు తెలియబడుచున్నది. నాటినుండియే పుట్టుకనుబట్టి వర్ణమను వాదము స్థిరపడినది. దాని నిర్మూలించుటకై బుద్ధభగవా నుడు, చివరదశయందు శంకరాచార్యులు, రామానుజా చార్యులు, రాజా రామమోహనరాయలు, స్వామి దయా నంద, వివేకానంద, రామతీర్థాదులు, మహాత్మా గాంధీ మొదలగువారు తీవ్రముగ కృషిచేసినట్లు చరిత్ర రుజువు చేయుచున్నది. కాని యేమిలాభము? స్వార్థము వ్రేళ్ళు పాతుకుపోయిన ఈ కులతత్వమను పిశాచము బుద్ధభగవానుని కృత్రిమముగ హత్య జేయించినది. ఆదిశంకరాచార్యులను హిమాలయములలో పూడ్చి పెట్టించినది. స్వామి దయా నందను వజ్రపుపొడితో కలసిన పాలను త్రాగించి ఘోరముగ ఖూనీ జేసినది. అంతదూరమేల? మహాత్ముని ఘోరకిరాతుని వలె నిట్టనిలువున పట్టపగలు అతిఘోరాతిఘోరముగ కాల్పిం చినది. కాల్పించుటయేకాదు. ఇదియొక శుభదినముగ

బొంబాయిరాష్ట్రమున కొందరిచే మిఠాయి పంచిపెట్టించినది. చంపినవాడు సాక్షాత్తురామచంద్రమూర్తియనియు, మహాత్మా గాంధీ స్త్రీలోలాది వంచనకృత్యములు చేసినవాలివంటివాడనియు మద్రాసురాష్ట్రమున బహిరంగ సభలో తీర్మానములు చేయించినది.[1] తమ అగ్రత్వమును నిలుపుకొనుటకై వీరుచేసిన హత్యలను గురించియు, మార్చిన శాస్త్రార్థములను గురించియు వివరింప దలచినచో ప్రత్యేక మదియే యొకభారతమగును. తమ అగ్రత్వమును నిలుపుకొనుటకై పౌరాణిక జాతి అమాయక ప్రజానీకములో శ్రుతి స్మృతుల కెట్లువిపరీతార్థములను చెప్పుచున్నదో చూడుడు.

"బ్రహ్మక్షత్రియ విట్చూద్రాం, శ్చాతుర్వర్ణాన్ గుణాత్మవాన్ ।
విప్రశుక్లోన్నృపోరక్త, పీతో వైశ్యో ౨ స్యజో ౨ సిత ॥

అనుశ్లోకమునందు "గుణాత్మవాన్" అను పదమును మభ్య పరచి తెల్లనివారు బ్రాహ్మణులనియు, ఎఱ్ఱనివారు క్షత్రియులనియు, పచ్చనివారు వైశ్యులనియు, నల్లనివారు శూద్రులనియు అర్థముజెప్ప బ్రాహ్మణ బ్రువులు సాహసించిరి. వీరు జెప్పిన అర్థము సరియైన దైనచో యూరపుఖండవాసులు తెల్లగనుందురు గాన వారిని బ్రాహ్మణులనియు, అరబ్బీ, చైనీయులు యెఱ్ఱగను, పచ్చగను నుందురుగాన, వారిని క్షత్రియవైశ్యులనియు, నీగ్రోలునల్లగ నుందురుగాన వారిని శూద్రులనియు, భారతీయులు మిశ్రమ వర్ణముగల వారు గాన సంకరజాతివారనియు, నిశ్చయింపవలసివచ్చును.

1. 1948 లో నెల్లూరులో జరిగిన బ్రాహ్మణ మహాసభ.

ఈ అర్థము నెవరైన నంగీకరింతురా ? ఆ శ్లోకములోని "గుణాత్మవాన్" అను పదమునుబట్టి గుణముల ననుసరించి వర్ణముల నిర్ణయించ వలసినదని యున్నది. సత్వగుణము తెల్లనిదనియు, రజోగుణము యెఱ్ఱనిదనియు, మిశ్రగుణము పచ్చనిదనియు, తమోగుణము నల్లనిదనియు శాస్త్రము నిర్ణయింపుచున్నది. కాబట్టి, తెల్లనివారు బ్రాహ్మణులనియు, ఎఱ్ఱనివారు క్షత్రియులనియు, పచ్చనివారు వైశ్యులనియు, నల్లనివారు శూద్రులనియు నిర్ణయించ బడినట్లు స్పష్టమగు చుండగా, దేహరంగునుబట్టి జాతులను నిర్ణయించుటెంత మూర్ఖత్వమో ఆలోచింపవలసియున్నది. అట్లయినచో బ్రాహ్మణులలో ఈనాడెంతమంది నల్లనివారు లేరు ? వారందరిని తక్కువజాతిగా నిర్ణయింపవచ్చునా ?

"బ్రాహ్మణోస్యముఖ మాసీద్బాహూరాజన్యఃకృతః
ఊరూతదస్యయద్వైశ్య పద్భ్యాంశూద్రో అజాయత॥

అను శ్లోకమునకు, భగవంతుని ముఖమునుండి బ్రాహ్మణులు, భుజములనుండి క్షత్రియులు, తొడలనుండి వైశ్యులు, పాదములనుండి శూద్రులు జన్మించిరని అర్థము చెప్పుదురు. పురుషునినుండి జన్మించిరను నదే ప్రకృతి విరుద్ధము. ఇక ముఖము, భుజములు, తొడలు, పాదములు మొదలగు వానినుండి జన్మించుటెంత ప్రకృతి విరుద్ధమో ఆలోచింపుము. ఒకవేళ అట్లే జరుగు ననుకొనుట కీవాడుకూడ బ్రాహ్మణ క్షత్రియాది జాతులు ముఖబాహ్వాద్యవయవములనుండి పుట్టవలదా ? ఎట్లో వీరు చెప్పిన దంగీకరింత

మన్నను నాలుగు జాతులలోని నలుగురు పురుషులేగదా భగవంతుని నుండి పుట్టినది ? స్త్రీ లెచ్చటనుండి జన్మించిరి ? శ్వపచచండాలాది జాతు లెందుండి బయలుదేరినవి ? ఇదెంత మూఢవాదమో చూడుడు ? సమాజమునకు, విజ్ఞానము ప్రబోధించువారు గాన బ్రాహ్మణులు ముఖమువంటి వారనియు, రక్షణ చేయువారు గాన క్షత్రియులు భుజములవంటి వారనియు, అట్లే సమాజమును పోషించువారు గాన వైశ్యులు తొడలవంటివారనియు, సేవ చేయుదురుగాన శూద్రులు పాదములవంటి వారనియు నిర్ణయించుచూ వ్రాసిన యజుర్వేద మంత్రమునకు, ఆయా అవయవములలో నుండియే జన్మించిరని అర్థము జేయ సాహసించు టెంత స్వార్థమో ఆలోచించవలసి యున్నది. మహాత్ములను హత్య చేయుట మొదలు, శాస్త్రములకు విపరీతార్థములను కల్పించువరకేల సాహసించిరన్నచో, మహాత్ముల సమత్వబోధలవలన ప్రపంచము నందుగల కృత్రిమకుల తత్వము నశించినచో, తమ అగ్రత్వము నిలువజాలదని తలంచి, ఇట్టి నీచకార్యములకు గడంగిరి. నీచస్వార్థమునకులోనైన ఈ భూదేవకుమారకులు జాతికి జాతినే నాశనము జేసినారనిన అతిశయోక్తి కాదు. హిందూజాతి మరొకరికి బానిసలగుటకు ఈ జాతిభేదములే కారణములని "విశ్వజ్యోతి" పత్రికాధిపతులగు జగద్గురు, శ్రీ బ్రహ్మానందగిరి స్వాములవారు చరిత్రాత్మకమైన ఉదాహరణలతో సశాస్త్రీయముగ నిరూపించిరి. సింధురాజగుదాహరు, అబ్దుల్ ఖాసించే ఓడిపోవుటకుగాని, తాఘేడను మాలకులజుడు మతాంతరుడై ఖుస్రో అను పేరుతో ఖిల్జీరాజ్యాధిపతియై

తన్నంతకు పూర్వము నీచముగచూచిన హిందూజాతిని సర్వ విధముల నాశనముజేయుటకుగాని కారణ మీ జాతిభేదములని చరిత్రస్పష్టము జేయుచున్నది. బ్రాహ్మణరాజులైన పీష్వాలు అబ్దాలీచే ఓడింపబడుటకుకూడ వారి అగ్రత్వమను దుర హంకారమే కారణము. బ్రాహ్మణేతరరాజులైన హోల్కారు, భాన్లే, సింధియా మొదలగు జాతులవారి సాహాయ్యమును పోగొట్టుకొనుటకును, హేమచంద్రుడను వైశ్యరాజు భైరం ఖానుచే ఓడింపబడుటకును అగ్రజన్ముల ఈర్ష్యాదులే కార ణములని చరిత్ర రుజువుచేయుచున్నది. ఇట్టి ఉదాహరణలు వందలు, వేలు చూపించవచ్చును. అంత దూరమేల ? జాతి భేదములను సహించక మతాంతరులైన నీ సోదరులేకదా ! నేడుకలకు తురకలుగమారి నీ జాతి నాశనమునకై కంకణము కట్టి నాటి పగతీర్చుకొనుచున్నారు. ఈఅగ్రజన్ముల దుర్మార్గ స్వార్థ మీ జాతిని జాతినే యెంతఅధోగతిపాలుజేసినదో తెలి యుటలేదా? ఇంత స్పష్టముగ చరిత్ర రుజువుచేయుచున్నను; ఈ జాతిభేదములను సుస్థిరముగ స్థాపించవలయునని తీవ్రముగ కృషిచేయువారు పండితులలో సైతముచున్నారని విన్నప్పుడు హిందూజాతి యెంత సిగ్గుపడవలసియున్నదో ఆలోచింపుము.

అగ్రత్వ, ధనికత్వ పిశాచము లావరింపని ఓ హిందూ పౌరుడా! హిందూజాతి బ్రతుకీ నాడు నీ చేతులలో నున్నది. శాస్త్రప్రమాణములచే తమ భూదేవత్వమునుస్థాపించి బ్రతుక జూచు ఈ యగ్రజన్ములచేతను, తమ ధనముచే ప్రపంచమును శాసింపజూచు ధనికవర్గముచేతను, హిందూజాతి పూర్వపు టౌన్నత్యమును పొందు ననుకొనుట కలలోనివార్త. ఈ

భూదేవ లక్ష్మీకుమారకులు పరస్పర సాహాయ్యములతో బ్రతుకుచుండిరి. వారిరువురి చేతనే భారతజాతి పతనమైనది. ఇంకను వారినే నమ్మికూర్చున్నచో, హిందూజాతి యనునదే ప్రపంచమున నశించుననిన అతిశయోక్తి కానేరదు. ఆది శంకరుని మొదలు, మహాత్ముని వరకు హత్యజేయబడిన దెవరి ప్రోద్బలముననో ఆలోచింపుము. రాజు విష్ణ్వాంశ సంభూతు డన్నదగ్గరనుండి, బ్రాహ్మణుడు దైవాంశ సంభూతు డన్నంతవరకు, ఎవరిద్వారా ప్రచారము జరిగినదో ఆలోచింపుడు. వీనికన్నిటికి ఒక్కటే స్పష్టమైన సమాధానము వచ్చుచున్నది. అదేమనగా, "స్వార్థులైన, భూదేవ, లక్ష్మీకుమారులచేతనే యని" కాబట్టి ఓ అగ్రత్వ, ధనికత్వ పిశాచము లావరింపని సామాన్య హిందూపౌరుడా! లెమ్ము! నీ కర్తవ్యము నెరవేర్చుము. హిందూజాతి పతనమునకు ముఖ్యకారణమైన ఈ వర్ణభేదమును సమూలముగ నాశము జేయుము. జాతి నాశమునకు మూలమైన ఈ వర్ణవ్యత్యాస మెంతవరకు నశింపదో అంతవరకీ భారతజాతికి ముక్తిలేదని చాటుము. నే నీపని చేయగలనా యని శంకింపకుము. అధర్మముగా ప్రవర్తించువా రెంతటి బలవంతులైనను ధర్మము ముందుమాత్ర మెన్నడు నిలువజాలరు. లెమ్ము! ఇప్పుడే లెమ్ము!! లేచి వర్ణభేద నిర్మూలనమునకై కంకణము కట్టుము!!! సోదరా! నీకు జయము కలుగుగాక.

# హిందూ దేవతలు - పురాణములు

బ్రాహ్మణులు తమ అగ్రత్వమును నిలుపుకొనుటకై వర్ణభేదములను బలపరచిరని పై ప్రకరణలో చదివితిమిగదా! తమ భూదేవత్వమును రుజువుజేయుటకై స్వర్గదేవతలను, పురాణములను యెట్లు కల్పించిరో ఈ ప్రకణములో చర్చింప బడుచున్నది. హిందూమతములో నెచ్చటను రూపనామము లతోగూడిన దేవుడొకడున్నట్లు కన్పించదు. అయినను మన అగ్రవర్గమువారు రకరకములైన రూపనామములు గలిగిన ముక్కోటి దేవుళ్ళను సృష్టించగలిగిరి. అగ్రవర్ణము వార మనుకొను స్వార్థులు తమ భూదేవత్వమును, భారతదేశమున సుస్థిరముగ స్థాపించుకొనుటకై స్వర్గదేవతలను తప్పనిసరిగ సృష్టింప వలసివచ్చినది.

స్వర్గదేవతలే లేకున్నచో మేము వారి ప్రతినిధులమైన భూదేవులమని చెప్పుకొనుటకే అవకాశము లేదుకదా? ఈ కారణముచే, స్వర్గదేవుళ్ళను తప్పనిసరిగ సృష్టింపవలసి వచ్చినది. స్వర్గదేవుళ్లు సత్యసంధులు, జితేంద్రియులు, ఏకాంత వాసులు, సత్యసంకల్పులు అని వర్ణించినచో వారి ప్రతి నిధులుగా చెప్పుకొను మన భూదేవ కుమారకులు అవినీతి గనడచుట కవకాశముండదను కారణముచేకాబోలు, స్వర్గ దేవతలనందరిని సంసారులుగనో, వ్యభిచారులుగనో, త్రాగు బోతులుగనో తయారుజేసిరి. స్వర్గదేవతలనే గాదు. మన ఋషులందరికి తలకొక అవినీతి నంటగట్టినట్లు చరిత్ర స్పష్ట పరచుచున్నది.

బ్రహ్మ తన కూతురునే వలచెను. శివుడు మునిపత్నుల నాశించెను. సూర్యుడు కుంతీప్రియుడు. చంద్రుడు గురుతల్పగతుడు. బృహస్పతి సోదరుని భార్యతో రమించెను. కేసరి భార్య యగు నంజనాదేవిని వాయుదేవుడు వరించెను. అగస్త్యుని తల్లియగు ఊర్వశితో వరుణుడు భోగించెను. విశ్వామిత్ర, పరాశర, వ్యాసులనుసైత మిట్టి భోగపరులనుగా సృష్టించిరి. ద్రౌపది కేవురు భర్తలు. వామనుడు మోసకారి. బలదేవుడు సురాపానరతుడు. ఇట్లెన్నియైన ఉదాహరణ లీయవచ్చును. ఇట్టి అవినీతిపరులగు స్వర్గదేవతలే సృష్టి, స్థితి, లయముల కధికారులనియు, వారి ఆగ్రహానుగ్రహముల మీాదనే మన కష్టసుఖము లాధారపడియున్నవనియు నమ్మించుటకై పురాణములను కల్పించిరి. ఈ పురాణములను పరిశీలనాబుద్ధితో చూచినవారికీ స్వార్థపరుల కల్పనాకథలలోని బూటకము స్పష్టము కాగలదు. అష్టాదశపురాణములలో నొకదాని కొకటి సంబంధము లేదు.

ఆదిశక్తినుండి శివుడు, వానినుండి విష్ణు బ్రహ్మలు జన్మించిరని మత్స్యపురాణములో నున్నది. దేవీభాగవతములో ఆదిశక్తి చేతులు నలుపుకొనుచుండగా బ్రహ్మవిష్ణుమహేశ్వరులు జన్మించిరనియున్నది. భాగవతములో లక్ష్మీదేవి సముద్రుని కూతురనియు, శివపురాణములో పార్వతి దక్షుని కూతురనియు నున్నది. దేవీభాగవతములో ఆదిశక్తియే లక్ష్మి సరస్వతీ గౌరీ దేవులుగా జన్మించెనని యున్నది. లింగపురాణములో మొట్టమొదట ఒక గ్రుడ్డు పుట్టినదనియు, దానినుండి ఈశ్వరుడు పుట్టినాడనియు, వాని కుడిప్రక్కనుండి

సరస్వతీ బ్రహ్మలును, యెడమ ప్రక్కనుండి లక్ష్మీ నారాయణులును పుట్టినట్లున్నది. నారదీయములో శ్రీమన్నారాయణుని కుడిప్రక్కనుండి బ్రహ్మయు, యెడమప్రక్కనుండి విష్ణువును, మధ్యగా ఈశ్వరుడును గలిగెనని వ్రాయబడియున్నది. విష్ణు పురాణములో శ్రీ కృష్ణుని భార్య లొక్కొక్కరికి ఇరువురు పుత్రులు జన్మించిరనియు, భాగవతములో ఒక్కొక్కరికి పదిమందిసంతానమనియు వ్రాయబడియున్నది. దేవీభాగవతములో తన భార్యను చంపుటచే భృగుమహర్షి శపింపగా, విష్ణువు యేడుసార్లు భూమిమీద పుట్టవలసి వచ్చినదని యున్నది.

బ్రహ్మాండపురాణమున బ్రహ్మదేవుడు రాముడుగా జన్మించెనని యున్నది. మరొకచోట త్రిమూర్తులు కలసి రాముడుగా జన్మించెనని యున్నది. భారతమున కుంభకర్ణుని లక్ష్మణుడు చంపినట్లును, రామాయణములో రాముడే కుంభకర్ణుని చంపినట్లును ఉన్నది. భారతమున మనువువల్ల మనుష్యులు కలిగిరనియు, భాగవతములో దక్షప్రజాపతివల్ల కలిగిరనియు నున్నది. భాగవతమున శుకుడు బ్రహ్మచారియనియు, దేవీ భాగవతమున పీవరియను స్త్రీవల్ల సంతానముగన్నట్లును నున్నది. విఘ్నేశ్వరుడు మలమునుండి పుట్టినట్లు శివపురాణములోను, బొమ్మనుచేసి ప్రాణముపోసినట్లు లింగపురాణములోను, గర్భమునుండియే జన్మించినట్లు వామనపురాణములోను, వ్రాయబడియున్నది. గంగాదేవి జననమును గురించి, బ్రహ్మకమండలజలమునుండి పుట్టినట్లు భాగవతములోను, శివుడు ఆకాశమునుండి రప్పించినట్లు బృహన్నారదీయము

లోను, శివుని కుడికంటినుండి జన్మించినట్లు సనత్కుమార సంహితలోను, హిమవంతునకు జన్మించినట్లు వాల్మీకి రామాయణములోను, లక్ష్మీసరస్వతుల శాపముచే భూమిపై జన్మించినట్లు దేవీ భాగవతములోను వ్రాయబడియున్నది.

ఈ విధముగా నారదుని జన్మను గురించియూ, దాసీ పుత్రుడని భాగవతములోను, కస్యపునకు జన్మించెనని భారతమున ఆది పర్వములోను, పర్వతునకు మేనమామయని సభాపర్వములోను, విశ్వామిత్రుని శిష్యుడని అను శాసినికము లోను వ్రాయబడియున్నది. ఈ విధముగా పరస్పరవ్యతిరేక సిద్ధాంతములతో గూడిన కథలతో, కేవల బూతుదేవుళ్ళను కల్పించిన ఈ పురాణములు వేదములకన్నముందే చెప్ప బడినట్లు కొన్ని చోట్లను, దేవతలచే రచింపబడినట్లు కొన్ని చోట్లను, వ్యాసులవారిచే వ్రాయబడినట్లు కొన్నిచోట్లను చెప్పబడుచున్నవి. ఈ పురాణములన్నియు నిటీవల కల్పింప బడినవనియు, పురాణములలో కడుపురాతనమైనవి వేయేండ్ల క్రిందటను, ఆధునికమైనది 450 యేండ్లక్రిందటను కల్పించబడి నట్లు స్పష్టమగుచున్నదని మతము కొరకై ప్రాణత్యాగము జేసిన పండిత లేఖూరాం ఆర్య ముసాఫరుగారు శాస్త్రీయముగ రుజువు జేయుచు అనేక వ్యాసములు ప్రకటించిరి. ఆవ్యాసము లలో పురాణను లిటీవల రచింపబడిన వనుట కీ క్రింది ఉదాహరణలు చూపబడినవి.

వ్యాసులు ధర్మరాజు కాలమువాడు. అనగా క్రీ.పూ. 2965 సంవత్సరముల నాటివాడు. అతనిచేత వ్యాత మీా

పురాణములు రచింపబడలేదు. శాంతిపర్వమున భీష్ములవారి యొద్ద వ్యాసుడు తన కుమారుడు చనిపోయినట్లు చెప్పి దుఃఖించెనని కలదు. ఆనాటికే చనిపోయిన శుకుడు ధర్మజుని మనుమడైన పరీక్షిత్తునెదుట భాగవతమును చెప్పినాడనుట యెంతటి హాస్యాస్పదమైన విషయమో తెలిసికొనవలసిన దనియు, గీత గోవిందము రచించిన జయదేవుని తమ్ముడగు భోపదేవుడు భాగవతము రచించియుండునని దేవీ భాగవత కర్తచెప్పినది సమంజసమైన దనియు, పురాణములన్నియు, బుద్ధునియొక్కయు, కృష్ణునియొక్కయు చర్యలను చెప్పు చున్నవిగాన బుద్ధుని యనంతరమే అనగా క్రీ. శ. 671 తర్వాతనే కొన్ని పురాణములు వ్రాయబడినట్లు స్పష్టపడు చున్నవనియు, కూర్మపురాణములో 30 వ, అధ్యాయము నందు శంకరుని మాయావాదమును గురించి కానవచ్చు చున్నది. కాబట్టి శంకరుని అనంతరమే పురాణములు పుట్ట బడినవనియు, అట్లుగాక శంకరునికాలములోనే పురాణము లున్నచో, అతడేల వానినిగురించి వ్రాయకుండుననియు, శంకరు డెచ్చటను పురాణముల పేరైన యెత్తలేదు. గాన అప్పటికి పురాణములున్నట్లు కనిపించదనియు, లింగపురాణ ములో వైష్ణవమత చిహ్నములగు శంఖచక్రములతో శరీర మును తప్తము గావించుటనుగురించి వ్రాయబడియుండుటచే, దీనిని రామానుజ మతానంతరమే వ్రాసియుందురనియు, పుగాకు దానముచేయుదాత నరకమున బడుననియు, పుచ్చు కొన్నవాడు పందియై పుట్టుననియు పురాణములలో నున్నది కావున పుగాకు అగ్బరుని కాలమునందొక అమెరికన్ వాని

ద్వారా మన దేశమునకు వచ్చినదని "తజల్ జహాంగేరీ"యను గ్రంథమున జహాంగీరు చక్రవర్తి వ్రాసియుండుటచే అగ్బరు కాలములోకూడా పురాణముల రచనసాగుచునే యున్నదనియు, గజనీమహమ్మదు, ఔరంగజేబుల కాలములలో నాశముగావింపబడినసోమనాధను, వారణాసి, రామేశ్వరము, మధుర మొదలగు శిథిల దివ్యస్థలములను గురించి నారదుడు సనకునితో చెప్పినట్లు పద్మపురాణము నందున్నది. దీనినిబట్టి పురాణములు యెప్పటివో గ్రహించ వలసినదనియు, భోజ రాజు కాలమున నొకడు మార్కండేయ మత్స్యపురాణములను రచించి వ్యాసునిపేరుతో ప్రకటించెననియు, రాజునకా సంగతి తెలిసి వానిచేతులు నరికించెననియు, భోజరాజు కాలమున రచింపబడిన "సంజీవిని" యను గ్రంథములో నున్నట్లు రుజువుచేయు చున్నారు. పురాణములలో నతి పురాతనమైనది వేయేండ్లక్రిందటను, ఆధునికమైనది 450 యేండ్లకు పూర్వమును వ్రాయబడినట్లు మార్గన్ గారు తలంచు చున్నారనియు, 11వ. శతాబ్దమునకు తరువాత తమ తమ ప్రాముఖ్యతలను నిలుపుకొనుటకై, శైవ, వైష్ణవ, మతగ్రంథ కర్తలు పురాణములను యథేచ్ఛగ సవరించిరని రమేశచంద్ర దత్తుగారభిప్రాయమిచ్చు చున్నట్లును వ్రాయుచు, కాళిదాస, భారవి, భట్టి, భవభూత్యాది మహాకవుల కాలమువరకు ఈశ్వరుడే ప్రధాన దేవతయనియు, మాఘుజయదేవుల కాలములో అనగా 11–12వ శతాబ్దముల మధ్య కాలములో కృష్ణుడను వానిని కల్పించిరనియు ఆర్య ముసాఫర్ గారు సశాస్త్రీయముగ నిరూపించినారు.

దీనినిబట్టి స్వార్థకాములగు అగ్రవర్ణుల మనుకొను వారు, భూదేవ కుమారకు లగుటకు ఇటీవలనే స్వర్గదేవతలను సృష్టించి వారి ప్రచారము నిమిత్త మీ పురాణములను రచించి, స్వర్గదేవతలను విగ్రహరూపముగా భూలోకమునకు తెచ్చి, ఆ విగ్రహములకు ప్రతినిధులుగా మన అగ్రజన్ములు భూదేవ కుమారులుగా చెలామణియైరి. హిందూమతమునకు విరుద్ధముగా ఈ విగ్రహారాధన లేలతెచ్చిరని యెవరైన విజ్ఞాను లడుగుదురను భయముచేత కాబోలు, వారే భాగవతమున సప్తమస్కంధములో "మందబుద్ధులకొఱకై త్రేతా యుగమున విగ్రహములు కల్పించబడినవి" అని వ్రాసికొనిరి.

స్వార్థపరులగు దౌర్భాగ్యులచే కల్పించబడిన విగ్రహారాధనను గురించి జగత్ప్రసిద్ధి గాంచిన శ్రీరామ తీర్థస్వాముల వారేమి చెప్పుచున్నారో చూడుడు.

"ఇండియాలో అన్ని సంస్థలపతనం యేది తీసుకు వచ్చింది ? 'విగ్రహారాధన' విగ్రహారాధన హిందూదేశీయ మైనది కాదు. ఈ రోజున ప్రజలంతా విగ్రహారాధకులని క్రైస్తవులు మీతో చెప్పుతారు. అగణితమైన వేదరచనలలో గాని, భారత వర్షంలోని కవిత్వము, వ్యాకరణము, గణితము, శిల్పము, సంగీతము ఈరచనల్లో దేనిలోగాని విగ్రహారాధనే కనబడదు. అయితే యెక్కడనుండి ఈ విగ్రహారాధన దిగుమతయింది ? హిందూమతములో విగ్రహారాధన ఒక భాగంకానేకాదు. హిందూదేశములోని విగ్రహారాధన క్రైస్తవులద్వారానే వచ్చింది. ఈ విషయానికి సంబంధించిన

చరిత్ర పుటలు ప్రజలింకా చదువలేదు ఈ నా పరిశోధన ముద్రితరూపంగా కూడా వస్తుంది. క్రీస్తు తరువాత నాలుగయిదు శతాబ్దాలమధ్య కొంతమంది రోమను క్యాథలిక్కులు ఇండియాకు దీనిని తెచ్చారు. వారు ఈనాడుకూడ దేశములోనున్నారు.

ఈ విషయం నేను బహిరంతః ప్రమాణాలతో రుజువు చేయగలను. దక్షిణహిందూస్థానములో నివసిస్తుండే వీరు సైంటుథామస్ క్రైస్తవులని పిలువబడుతారు. వీరే విగ్రహారాధనను ప్రవేశపెట్టింది. అంతః ప్రమాణాలతో ప్రముఖ విగ్రహావాదియైన రామానుజునికి మార్గదర్శి ఈ సెంటు థామస్ ఒకడని నేను రుజువు చేయగలను." (వందేమాతరం నుండి) ఈ విగ్రహారాధనలను గురించి నవీన ప్రబోధకులలో నొకరగు, జగద్గురు, శ్రీ బ్రహ్మానందగిరిస్వాముల వారేమి చెప్పుచున్నారో చూడుడు.

"ఈ ప్రపంచమంతయు, చైతన్యము, జడము అను రెండు పదార్థములతోనయ్యెను. ఈ రెంటికంటె నన్యముగ మరొక పదార్థములేదు. ఈ యథార్థము నెఱుగని వారి కొఱకు పండితులు మరొక మార్గమును కల్పించిరి. ఎట్లన: "ఈ సర్వ ప్రపంచోపాధి యుక్తమగు చైతన్యమీశ్వరుడు. వ్యష్టిశరీరోపాధి యుక్తమగు చైతన్యము జీవుడు. జీవులందరా పరమేశ్వరుని బిడ్డలు. తమబిడ్డల కొరకు పరమేశ్వరుడు సమస్త పదార్థములతోగూడిన ప్రపంచమును సృజించెను. ఆ పరమేశ్వరుని విశ్వ కుటుంబ కల్యాణము

కొరకు, జీవులు పరస్పర సాహాయ్యములతో కర్మములు చేయ వలయును. అట్లు చేసినవారికి పరమేశ్వరుడు సర్వసుఖముల నొసంగును. వ్యష్టిస్వార్థము కొరకు కర్మము లాచరించిన వారికి దుఃఖము లొసంగుననిచెప్పిరి" క్రమక్రమముగ నా జీవేశ్వరుల స్థితి అధోగతి పాలయినది. స్వార్థపరులు తమ యిష్టమువచ్చినట్లు దైవములను సృజించి ప్రజలపై కెగద్రోలిరి.

ఈ దేవుళ్లు అసంఖ్యాకులు. బ్రహ్మ, విష్ణువు, శివుడు, వినాయకుడు, ఇంద్రుడు, శక్తి, రాముడు, కృష్ణుడు, అల్లా, ఎహోవా మొదలగువా రెందరో గలరు. వీరుగాక గంగా నమ్మ, పోలేరమ్మ, పోతురాజు మొదలగు చిల్లరదేవుళ్ళును కలరు. గట్టు, పుట్ట, చెట్టు, చేమ, గడ్డి, గాదముకూడా దేవుళ్ళే యగును. చచ్చినవారు కొందరు వీరులు, పేరంటాండ్రు, పీర్లు మొదలగు దేవుళ్ళయ్యెదరు. ఈదేవుళ్ళనందరిని లెక్కించినచో ఈ ప్రపంచమున గల మానవులకు తలకొకవేయియో, రెండు వేలో అయ్యెదరు. వీరందరకు వేలు వేలుగా లోకము లున్నవి. చక్కని భవనములుకూడ గలవు.

ఇందులో కొందరు దేవుళ్ళు బ్రహ్మచారులు. కొంద రాలుపిల్లలుగల సంపన్న గృహస్థులు. ఇద్దరు ముగ్గురు పెండ్లాలున్న సన్యాసులు కూడ లేకపోలేదు. స్వార్థపరు లీ దేవుళ్ళనందరను భూలోకమునకు తీసికొనివచ్చి దేవాలయములు, మసీదులు, చర్చిలు కట్టించి,అందు రాతి రూపముగనో, లోహరూపముగనో, కొయ్యరూపముగనో, మట్టిరూపము గనో, కాగితము రూపముగనో, శూన్యరూపముగనో ప్రవేశ

పెట్టి, యేటేటా పెండ్లి పేరంటములు చేయుచు, పామరులగు ప్రజానీకమును మోసగించి, వారి సర్వస్వమును, సర్వవిధముల కొల్లగొట్టుచున్నారు." (సాంఘిక సూత్రములనుండి) ఈవిగ్రహారాధనలను గురించి జగత్ప్రఖ్యాతిగాంచిన భగవాన్ రామకృష్ణ పరమహంసల వారి ప్రియశిష్యుడగు వివేకానంద స్వాములవారీ క్రింది విధముగ నిరూపించుచున్నారు.

అర్థశూన్యములగు మతగురువులయొక్క బూటకపు మాటలుతప్ప ఈ స్వర్గనరకములన్న వేమిటి ? హిందూదేశమిప్పుడు క్షామమున పీడింపబడుచున్నది. కాని చక్రవర్తి నైనఘణముగా గోనజాలు రత్నరాసులతో నొప్పు దేవాలయము లెన్నేనిగలవు. నిర్గుణతత్వమును ప్రజలకు బోధించితిమేని యిట్టి పురోహితులవృత్తి నాశనమై పోగలదు. అయిననేమి ? పురోహితుల విడచివైచి ఈ తత్వము ప్రజలకు బోధింపవలసియే యున్నది.

ఎవరు యెవరిని పూజించుట ? నీవే ఈశ్వరున కుత్తమోత్తమాలయమవు. దేవాలయములను గాని, విగ్రహములనుగాని, సేవించుట, వేదముల నారాధించుట నాకయిష్టము. భగవంతుడు మీలో నధివసించియున్నాడు. అయినను వెట్టియూహాలకు లోనై దేవాలయములను, చర్చిలను కట్టించుచున్నారు. ఇందే దేవాలయములు పూజార్హములు కావు. వేదాంతము పలుకునదిది. "ఓ మిత్రమా! అజ్ఞేయుడని (కనబడనివాడని) యెవ్వనినీవు పూజించుచున్నావో 'అతడే నీవు' ఇంతయేల, అహం(నేను) అను అఖండభావనతో ఎవ్వడు

సర్వకాలముల ప్రకాశించుచున్నాడో, అతడే జగత్తునకు, ప్రాణము, తేజమునై యున్నాడు. ఆ "నేను" లేనియెడల, నీవు సూర్యునిగాంచలేవు. సర్వము తమోరాశియై పోవును. ఆ "నేను" ప్రకాశించుటచేతనే నీవు జగములగాంచుచున్నావు. 'ఈ సత్యమైన సిద్ధాంతమునకు పలువురు భీతిల్లుచున్నారు' ఇదిధర్మము కాదందురు. ఎక్కడనో స్వర్గములో దేవుడుండి, ఎవ్వరితోనో (వారి ప్రతినిధులైన భూదేవకుమారులతో నన్నమాట) తానే దేవుడనని చెప్పినట్లు పురాతనాదర్శనముల గురించి సిద్ధాంతముల కల్పించుచుందురు. మరియు వారిట్లందురు. "నేనే బ్రహ్మనను, అద్వైతము బోధించినచో, నేనేమి తప్పుజేసినను శిక్షించువారు లేరనుకారణమున లోకమునకు హానివాటిల్లదా అందురు. ఇట్టిఅపాయము సగుణారాధకులలో లేదని రుజువు మాత్రమేమిగలదు? మీరు మీనుండి వేరై యెచ్చటనో స్వర్గమందున్న భగవంతుని పూజించుచున్నారు. వానినిగురించిమీరు భయపడుచున్నారు. ఆభయముతో మీరు గజగజలాడుచు మరలమరల జన్మించుచున్నారు. సగుణారాధన జేయువారిలోను, నిర్గుణారాధన జేయువారిలోను, ఎవరినుండి ఎక్కువమంది లోకారాధకులు బయలుదేరిరో చూడుడు. మహాకార్యదీక్షాపరులును, మహత్తర ధర్మతత్పరులును ఎవరినుండి తలచూపుచుండిరి? నిర్గుణోపాసకులనుండియే యనుట తథ్యము. సగుణారాధనయే ద్వేషముల పుట్టించి, లోకమును రక్తములోముంచి, ఒండొరులనుచీల్చి చెండాడునటుల చేసియుండెనని చరిత్రవేనోళ్లచాటుచున్నది. ఒక రాజునకు పిచ్చియెత్తి తన దేశపు ప్రభువును

చూడవలయునని ఇంటింట తిరిగెనట. అతడే ప్రభువై యుండగా అతనికి మరొక రాజు కాన్పించుకెట్లు? కావున మనమే బ్రహ్మమను జ్ఞానమునుపొంది, అతడెక్కడో గలడను వెతకులాట మానవలయును. ఇకనైన ఈ పిచ్చి పోకడలను కట్టిపెట్టుము. కేవలము మానవుని సత్యస్వరూపము నెరుగుటయే వేదాంతార్థము. మీకు బైబిలులోని వాక్యము జ్ఞప్తి లేదా? మీకు నరుని ముఖములో బ్రహ్మము కానరానియెడల, మేఘములందును, స్తంభమును, నిర్జీవమును అగు జడపదార్థములతో జేసిన విగ్రహములందును, మీ మెదడు కల్పించిన కల్పిత గాధలందును, మీ రెటుల ఆ బ్రహ్మమును చూడ గలరు? మతము తగినంత విశాలముగ నుండవలయును. దాని సిద్ధాంతములన్నియు వివేక పరిశీలనకు నిలువ గలిగినవిగా నుండవలయును. మతసిద్ధాంతముల నున్నదున్నటులే నమ్మవలయునుగాని తర్కము చేయరాదని కొందరందురు. వారల్లెల యందురో యూహింపలేకున్నాను. మనము తర్కశాస్త్రముల సాహాయ్యము విడచితిమా! మత విషయమునసైతము నిర్దుష్టములగు పరిష్కారములు లభింప జాలవు.

ఒక మతము మహానీచవిషయమును దేనినైనశాసించునను కొనుడు. ఉదాహరణకు "మహమ్మదీయులు కానివారిని వధింపుడు" అని కురానులో నున్నదట. అందుచే మతాంతరుల చంపుట ధర్మమని మహమ్మదీయుడనును. అది తప్పు కాదాయనిన అది మా వేదగ్రంథము చెప్పినది కావున నది ధర్మమేయని యతడనును. క్రైస్తవులు మా బైబిలు యింకనూ

పురాతనమైనది, మా బైబిలులోని పర్వతోపన్యాసముల వినుడనిన, బౌద్ధుడు యింకనూ మా గ్రంథము ప్రాచీనమైనది కావున మా గ్రంథము ప్రమాణమనును. ఇంతలో హిందువుడు వచ్చి, వేదమింకను ప్రాచీనమైనది గాన మా నియమములను పాటించవలయుననె ననుకొనుడు. అప్పుడీ గ్రంథములలో ఉత్తమమని యెవడు దేనిని రుజువు చేయగలడు ? రుజువు చేయుటకు మరొక కురాను, బైబిలు, వేదము లేవి ? లేవు. అందుచేత సర్వజనాదరణీయమైనదియు, స్వతంత్రమైనదియు, నగు ప్రమాణ మొక టవసరము. అది తర్కము నకుమించి యేది సత్యమో, సర్వజనాదరణీయముగా తేల్చగలదు. తర్కమునకు దిగవద్దు, గ్రంథములలో నున్నది గాన నమ్మమనుట యెంత దుర్బలమైన వాదన. అట్టి మత గ్రంథములు, మతబోధకులు చెప్పిన పరిష్కారముల కొడబడుటకన్నను, ఎవరిమాటనో ప్రమాణముగా తీసికొని, కోటానుకోట్ల దేవతలు గలరని గుడ్డి నమ్మకము వహించుట కన్నను, తర్కము నాధారము జేసికొని నాస్తికుడయి పోవుటే మానవజాతికి శ్రేయస్కరము. మనకు కావలసినది గుడ్డి అనుకరణకాదు. అభివృద్ధి పురోగమనము. ఆత్మ సాక్షాత్కారమే యేకైక మార్గము. అది మనయందే యున్నది. జిజ్ఞాసచేత నది సిద్ధించును. నరులు సమాలోచన చేయువలయును. మట్టిముద్ద యెన్నడూ యోచన చేయజాలదు. కావున అది సదా మట్టిముద్దగనే యుండిపోవును. ఆలోచనాపరుడగుటే నరుని ఘనత. యోచనచేయుట నరుని స్వభావము, ఇదే వారికిని పశువులకునుగల భేదము చూపునది. వేదములో

నుండి సృష్టిబయలుదేరినదని విశ్వసించు హిందువులు గలరు. వీరి శాస్త్రదాస్య మెంతదూరము పోయినదంటే, "ఆవు" అను నది నీకెట్లు తెలియునన, గో అను శబ్దము వేదములో గలదు గానయని వీరందురు. వెలుపలనొక మనుష్యుడున్నట్లు నీకే విధమున తెలిసినదన్నచో, వేదములో మనుష్యుడని యుం డుటచే నని వీరందురు. సరియైన సత్యమార్గమును వెతుకుటకు విగ్రహములు వేదములు కావని చెప్పుచూ పై ఉపన్యాస సారమంతయు ఈ క్రిందిపద్యములో స్పష్టము చేయు చున్నారు.

ముజ్జగంబియ్యు జాలని ముక్తికొరకు
నెచట వెదకెదు మిత్రమా నెటు వెదకెదు
గ్రంథముల గుళ్ళ వెదకిన కలదెఫలము
నిన్ను దాలాగుకొని పోవుచున్న త్రాడు
నీ కరమునందె యున్నది నిజముగాను
వగచుటను మాని నీవింక వదలి దాని
ఎత్తిపాడుము కంఠము యెత్తిపాడు
యతివరా! ధీర! ఓమ్, తత్సదనుచు పాడు.

అని గానము చేసినాడు. పురాణములను, దేవుళ్ళను సృష్టిం చుటతోనే మన భూదేవకుమారకులు తృప్తిజెందలేదు. వేదోపనిషత్తులలో సైతము వీరి స్వార్థబుద్ధికి సంబంధించిన కల్పనలను జొప్పించియే యున్నారు. అధర్వవేదములో జొప్పించిన ఈ క్రింది విషయము లెంత స్వార్థపూరితములో చూడుడు.

1. పూర్వమొక స్త్రీకి పదిమంది బ్రాహ్మణేతరపతులున్నను బ్రాహ్మణుడామెనుకోరెనేని ఆమె అతనికే పత్నియగును.
2. బ్రాహ్మణుని భార్య నపహరించుటయే గర్భపాతములకు, పశువుల నాశమునకు కారణము.
3. ఏరాజ్యమున భార్యలేదను దుఃఖముచే బ్రాహ్మణుడొక్క రాత్రి గడపునో ఆ రాజ్యమందలి పశువులకు కీడు వాటిల్లును. ఎడ్లు పనిచేయవు.
4. బ్రాహ్మణుడు గోవునడిగినంతనే,అది యెవరిదైననుకానిండు. వెంటనే యిచ్చివేయవలయును. లోకములోని గోవులన్నియు, అవి యెవరివద్దనైన నుండనిండు, అవి బ్రాహ్మణునకు దాచుకొన్న సొమ్ము.

ఈవిధమైన స్వార్థపూరితములైన వ్రాతలచేత కలుషితమగుటచేతనే వేదముపై గౌరవము లేకుండ పోజొచ్చినది. ఈ పరిస్థితిని ముందుగనే గ్రహించి మన పండితులు ఉపనిషత్తులు మాత్రమే పరమ ప్రమాణములని ప్రచారము చేయసాగిరి. ఉపనిషత్తుల కెప్పుడు గౌరవస్థానము లభించినదో కొద్దికాలములోనే వానిసంఖ్య 1180 గా పెరిగిపోయినవి. ఛందస్సు తెలిసిన ప్రతి భూదేవకుమారుడొక ఉపనిషత్తు నిర్మించ సమకట్టినప్పుడు పెరుగ కేమి యగును? అక్బరుని ప్రీత్యర్థమై యెవడో ఒక భూదేవకుమారుడు కడుపుకక్కుర్తికై అల్లా ఉపనిషత్తని ఒక ఉపనిషత్తు నిర్మించుటయు, అనంతోపనిషత్తు, బృహద్వాశిష్టరహితోపనిషత్తుమొదలగునవి నిన్నమొన్న సృష్టింపబడినట్లు రుజువగుటయు పండితు లెరుగనిది కాదుకదా?

ఆకారణముచేత నేకదా ? 1180 ఉపనిషత్తులు ప్రమాణములు కావనియు, 1001 మాత్రమే ప్రమాణములని కొంతకాలమును, 108 మాత్రమే ప్రమాణములని కొంతకాలమును, దశోప నిషత్తులే ప్రమాణములని కొంతకాలమును ప్రచారము చేయ వలసి వచ్చినది.

ఈ దశోపనిషత్తుల సిద్ధాంతములుకూడ పరస్పర విరుద్ధములతో గూడియున్న వను కారణముచేత నేకదా బ్రహ్మ సూత్రములను ప్రచారములోనికి తీసికొనిరావలసి వచ్చినది? ఆసూత్రములైనను ఏకసిద్ధాంతమును ప్రతిపాదించుచున్న వాయనిన, అట్లునులేను. ఆ సూత్రముల ఆధారముతోనే గదా త్రిమతకర్తలు పరస్పరవిరుద్ధ సిద్ధాంతములతో గూడిన మతములను స్థాపించినది. ?

ఇంతటి విరుద్ధభావములను ప్రతిపాదించు గ్రంథ సముదాయమువల్ల హిందూమత సిద్ధాంతమునకు భంగము కలుగుచున్న కారణముచేతనే భారతములోని భీష్మపర్వాంతర్గతమైన 701 శ్లోకములకు ప్రాముఖ్యతనిచ్చి భవవద్గీతయను పేరుతో ప్రచారములోనికి తీసికొని రావలసివచ్చినది? హిందూమత సత్యసిద్ధాంతమును వ్యక్తపరచుననినమ్మిన భగవద్గీత కూడ ఎన్నియో విరుద్ధమైన అర్థములతో వారివారి సిద్ధాంతముల కనుగుణ్యమైన యర్థములను చేయుటకు విశ్వప్రయత్నములు జరిగినవి, జరుగుచున్నవి, జరుగనున్నవి. అంతవరకేల? భగవద్గీతను బట్టి విగ్రహారాధకులు కూడ వారిసిద్ధాంతమునకు బలమును చేకూర్చుకొన ప్రయత్నించిరి. దాని ఫలితమే

నేడు గీతను పఠించు వేయిమందిలో 999 మంది విగ్రహారాధన చేయుచుండిరి. అనగా గీతలోని భావములను మననము జేయ ప్రయత్నించు వారు వేయింటిలో నొక్కరున్నచో, గీతను బోధించిన కృష్ణునే భగవంతునిగా నమ్మువారు 999 మంది ఉన్నారని అర్థము. ఛాందస పౌరాణికుల స్వార్థ ప్రబోధములే పాపమీ యమాయక భక్తుల నీ పనిలో ప్రవేశపెట్టినవి.

నేనే ఈ సర్వమునకు కారణుడనని శ్రీకృష్ణుడే స్వయముగా అర్జునునకు బోధించలేదాయని అమాయకులకు, మన స్వార్థ పౌరాణికజాతి ప్రబోధించుచుండును. ఇది ఘోర అసత్యప్రచారము. తత్త్వోపదేశము చేయునప్పుడు, నేనే ఈ బ్రహ్మాండమునకు కర్తనని చెప్పుట హిందూతత్త్వజ్ఞుల సాంప్రదాయము. నేననిన ఈశరీరమని అర్థముకాదు. ఈ దేహేంద్రియాది జడసంఘాతమున కధిష్ఠానమేదియో, దేనిసత్తచే 'నేను నేన'ని పలుకబడుచున్నదో, ఆకారణవస్తువగు సత్తయే, లేక చైతన్యమే నేనను తాత్పర్యముతో, సద్గురువులు శిష్యులకు, 'ఈ కనిపించు సర్వప్రపంచమునకు నేనేకర్తన'ని చెప్పుట హిందూసంప్రదాయము. అట్లుగాక గీతలోని నేనను పదమునకు శ్రీకృష్ణునే దైవముగా నిర్ణయించినచో దేవునకు దేహేంద్రియములు, దారాసుతులు, జననమరణములు, రాగద్వేషములు మొదలగునవుండునా ? అనునది మొదటి ప్రశ్న. మరొకటేమనగా నేనను సంబోధన కారణముగా శ్రీకృష్ణుని దేహమునకే బ్రహ్మత్వమంటకట్టజూచినచో, ఆంజనేయునకు తత్త్వము బోధించునప్పుడు, శ్రీరాముడుకూడ నేనే అపర

మాత్మనని చెప్పినాడుగదా! దానినిబట్టి రాముని దేహమే దైవమందమా? ఇది యొకటేల? శివుడు పార్వతి కుప దేశించినప్పుడును, దక్షిణామూర్తి సనకసనందనాదుల కుప దేశించినప్పుడును, శ్రీమన్నారాయణుడు నారదున కుప దేశించినప్పుడును, రామునకు వశిష్ఠుడుపదేశించినప్పుడును, నేనే ఈ బ్రహ్మాండమునకు కర్తననిగదా బోధించినది? మనలో నేది నేను నేనని చెప్పబడుచున్నదో, ఆ చైతన్యపదార్థమునకది వర్తించునా? లేక, నేనని చెప్పువాని దేహమునకు, వర్తించునా? "నేననిన మేనుకాదని" సీతారామాంజనేయాది సమస్త గ్రంథములలోను స్పష్టముగ నిరూపింపబడియున్నది.

మన భూదేవ కుమారులకు స్వర్గదేవతల అవసర మెంతేని కలదుకాబట్టి, దీనిని మరుగు పరచి ఆ చైతన్య మును ఒక వ్యక్తిగా తయారు జేయుటకే సదా ప్రయత్నించు చుండెదరు. ఇన్ని మాటలేల! వేదసారములని ప్రఖ్యాతి గాంచిన "ప్రజ్ఞానం బ్రహ్మ" "అహం బ్రహ్మాస్మి" "తత్త్వమసి" "అయమాత్మా బ్రహ్మ" యను మహావాక్యములు కూడ నేనని చెప్పబడు చైతన్యమే సమస్త చరాచరములలో నున్నదనియు, "నీవు వేరు అతడు వేర"ని తలచుట కేవల మజ్ఞానమనియు, స్పష్టముగ మన తత్త్వజ్ఞులెల్ల రంగీకరించి నారు. ఈనాడు కూడ ఉత్తమ సంస్థలుగాని, వ్యక్తులుగాని, ఈ సత్యమునే లోకములో చాటుచున్నారు. శబ్దార్థమును బట్టి చూచినను, "దివ్" అను ధాతువునుండి దేవుడను పదముత్పన్నమైనది. "దివ్" అను ధాతువునకు ప్రకాశ మనియే అర్థము కాబట్టి, అందుండి వచ్చిన దేవుడను పదము

నకుకూడ నదేఅర్థముకదా ? ఇంత స్పష్టముగ కనిపించు చున్నను, మన భూదేవ కుమారకులు, "దేవః" అను పదము నకు కాళ్లుచేతులు తగిలించి, దేవిగనో, దేవునిగనో తయారు చేసి, యెక్కడో ఒకలోకములో కూర్చుండబెట్టినారు. వారికి ప్రతినిధులుగా వీరుతయారై, ఆస్వర్గదేవతలను విగ్రహరూప ములో ఈ యమాయక భక్తబృందములకు దర్శన మిప్పించు చున్నారు. ఉత్తమప్రవక్త లెవ్వరీసిద్ధాంతము నంగీకరించ లేదు. నిజమునకు హిందూ సాంప్రదాయములో ఈ వాస నయే కనిపించదు. హిందూ తత్వ నిర్ణయకారులెల్లరు, సృష్టి కారణములను మూడు విధములుగా నిర్ణయించినట్లు స్పష్ట పడుచున్నది.

ఒకటి ఆరంభవాదము. పరమాణువుల సంయోగ వియోగములను బట్టి సృష్టిస్థితి లయములు జరుగుచున్నవని దీనిసిద్ధాంతము. ఈ వాదము ననుసరించినవారు న్యాయ, వైశేషికాదులు. మరొకటి పరిణామవాదము. అవ్యక్తమగు ప్రకృతియొక్క పరిణామమువలననే, సృష్టి, స్థితి, లయములు జరుగుచున్నవని దీనిసిద్ధాంతము. ఈ వాదమును బలపరచు వారు. సాంఖ్యులు, యోగులు మొదలగువారు. మూడవది వివర్తవాదము. కార్యములనేకములుగా కనిపించు చున్నను, వానికి కారణములైన, మన్ను, ఇనుము, బంగారము ఒక్కటి యైనట్లు ఒకేచైతన్యమే, భ్రాంతిచే ప్రపంచముగా కనిపించు చున్నదని దీనిసిద్ధాంతము. ఈవాదానుకూలురు వేందాంతులు. దీనినిబట్టి దర్శన కర్తలైన తత్వజ్ఞులెవ్వరిచేతను, ఈ సృష్టికొక కర్తగలడని నిర్ణయింపబడినట్లు కనిపించుట లేదు. ఏ తత్వజ్ఞుని

దృష్టిలో చూచినను, ఈ సృష్టి అజ్ఞానము, ప్రకృతి, లేక, పరమాణువుల కారణముగా ప్రారంభించబడినది. లేక పరిణమించబడినదనియే నిర్ణయమగుచున్నది. వేదాంతులలో కూడా కేవలచైతన్యమని శంకరులును, చిదచిద్విశిష్టమని రామానుజులును, స్వతంత్రా స్వతంత్ర తత్వములు పరస్పర భిన్నములని మధ్వాచార్యులును చెప్పినట్లు కనిపించుచున్నదిగాని మనభూదేవ కుమారకులు చెప్పినట్లు స్వర్గదేవుళ్లు సృష్టిచేసిరని యే ప్రవక్తగాని, ఏయుపనిషత్తుగాని చెప్పలేదు.

1. తనలో ఏచైతన్యముకలదో సూర్యునిలో నున్నది కూడ నదియేయని తైత్తిరీయోపనిషత్తు చెప్పుచున్నది.

2. పరమాత్మ యనగా సత్యమునకు సత్యమని బృహదారణ్యకము చెప్పుచున్నది.

3. ఈ భూతములన్నియు దేనినుండి పుట్టుచున్నవో, దేనివల్ల జీవించి, తిరిగి దేనియందు లయమగుచున్నవో, ఆ సత్తా పదార్థ మొక్కటియే ప్రపంచమున నున్నదని తైత్తిరీయ బృగువల్లి చెప్పుచున్నది.

4. ఆ పరమాత్మ ఇంద్రియాదులులేనిది. సర్వత్ర నుండునది. శాశ్వితమైనదని ముండకోపనిషత్తు స్పష్టము చేయుచున్నది.

5. ఏది కనులకుకానరాదో, దేనివలన కనులు చూచుచున్నవో, ఆ శక్తి యే పరమాత్మయని కేనోపనిషత్తు చెప్పుచున్నది.

6. ఆత్మ స్త్రీ పురుషనపుంసకము కాదనియు, ఏ శరీరముతో నుండునో, నా శరీరముతో తాదాత్మ్యమొందు సత్తా స్వరూప మగుననియు శ్వేతాశ్వతరోపనిషత్తు చెప్పు చున్నది.

ఈ విధముగా సర్వోపనిషత్తులు ఘోష పెట్టుచున్నవి. అనగా, ఎవ్వడు సర్వభూతములలో గల చైతన్య ను, తనలో గల చైతన్యమును, నొక్కటిగా నెరుగుచున్నాడో, అట్టి వాడొక్కడే జనన మరణాది సమస్త సంసార బంధముల నుండి విముక్తుడగునని తాత్పర్యము. ఈ సత్యము సామాన్య ప్రజలలో ప్రబోధము జరిగినచో స్వర్గదేవతలకు స్వస్తి చెప్పవలసి వచ్చుననియు, దానితో తమ భూదేవత్వమునకు ముసలము వచ్చుననియు, భయపడిన స్వార్థపరులగు భూదేవ కుమారులు, ఈ సత్య ప్రచారమునకెన్నో అపవాదములు చూపుచు, స్వర్గదేవతలే సర్వస్వతంత్రులనియు, వారి దయా దాక్షిణ్యములపైననే, మన సుఖదుఃఖములు, జనన మరణ ములు, స్వర్గ నరకములు కలుగుచుండుననియు సామాన్య ప్రజానీకములో గాఢముగ ప్రచారము చేయుచుండిరి. సర్వము స్వర్గదేవతల యధీనమే యనియు, నీ స్వప్రయత్న ములవల్ల లాభమేమియు లేదనియు, నిట్టి ఆత్మ వినాశకర మగు బోధలను చేయసాగిరి. సామాన్య ప్రజ లీ బోధలను విని కర్తవ్య విముఖులై స్వర్గదేవతల దయా దాక్షిణ్యముల కెదురు చూచుచుండిరి.

ఈవిధముగా నీ భూదేవకుమారు లీ భారతదేశమును దీనదశను పొందించుటచే దాని ఫలితమును ఈ నాడెన్ని విధముల మన మనుభవించుచున్నామో ప్రజ్ఞావంతుల కెల్ల రకు స్పష్టముగ కనిపించుచునే యున్నది.

ఇట్టి మూఢసిద్ధాంతములను నమ్మి సమాజములో తాముచేయవలసిన కర్తవ్యములను వదలి, అంతయు భగవంతుడే చేయునను శుష్కప్రబోధములను ప్రచారముచేయుచు, తాము కేవలము సోమరులై పరుల కష్టార్జితముపై యీ బ్రాహ్మణబ్రువు లెట్లాధారపడినారో, చూడుడు. ఈ నీచ సిద్ధాంతమునునమ్మి, తాము చెడుటయేగాక, ఒకప్పుడు రత్న గర్భగా వన్నెకెక్కిన భారతమాత నెట్టి దీనావస్థలోనికి తెచ్చినారో ప్రతిమనుష్యుడుకూడ తెలిసికొని, స్వార్థపరులగు భూదేవ కుమారకులచే కల్పింపబడిన పురాణ సిద్ధాంతముల పైనను, వారిచే సృష్టింపబడిన స్వర్గదేవతల పైనను ఆధార పడక మానవ కర్తవ్యమననేమియో తెలిసికొని నీవూ, నీ దేశమూ త్వరలో నభివృద్ధికి వచ్చెదరుగాకయని యాశించు చున్నాను.

---

# మానవకర్తవ్యము

సర్వము భగవంతుడే చేయుచుండుననియు, తానీ ప్రపంచ వ్యవహారముల కెంతదూరముగ నుండునో, భగవంతున కంత దగ్గరవాడ నౌదుననియు నమ్మి సోమరిజీవితము గడుప సాహసించువా రనేకులు గలరు. సమాజాభివృద్ధికై తాను పాటుబడుటయన, భగవంతునిపై నమ్మకము లేకపోవుటయేయని వీరినమ్మకము. మనప్రయత్నములలో కొన్నిఫలించుటకును, కొన్నివిఫలమగుటకును భగవంతుని, నిగ్రహానుగ్రహములే కారణములని నమ్మెడి అమాయకుల నాకర్షించి, వారి దయా భిక్షములతో ఈ శుష్క వేందాంతులు బ్రతుకుచున్నారు.

సోమరిగా తిరుగు తన కీ పిండివంటలతో భోజనము దొరకుటకుగల కారణ మా భగవదనుగ్రహామే యని ఈ సంఘద్రోహు లా యమాయకులకు నచ్చజెప్పుచుందురు. ఈ మాయకులు చెప్పునట్లు సమాజముతో సంబంధము లేక, యేకాంతముగ సర్వేంద్రియ నిగ్రహముకలిగి యుండుటే నిజమైన వేదాంతమైనచో, మన వెనుకటి తత్వవేత్తలెల్ల రట్లే యుండవలసినదిగదా ?

చరిత్రలో నట్టివారి నొక్కరినైన నీ వెల్లులు చూపించ గలరా ? వాగింద్రియముండుటచేతనే కదా ! శుకమహర్షి భాగవత ముపదేశింప గలిగినది? అంతఃకరణముండుట చేతనే కదా ! వ్యాసాది మహర్షులు సూత్ర, పురాణాది గ్రంథము

లనురచింప గలిగినది? ఇంద్రియ మనంబులు లయించిపోవుటే మోక్షమైనచో వశిష్ఠ, విశ్వామిత్ర, యాజ్ఞవల్క్యాది మహర్షు లెట్లుత్తమ గ్రంథములను వ్రాయగలుగుదురు ? చూడాల తన భర్తకెట్లు జ్ఞానోపదేశము చేయగలిగెడిది ? శంకరాచార్యులు తన మతము నెట్లు వ్యాప్తముజేయ గలుగును ? రామానుజ, శ్రీ కృష్ణచైతన్యాదులు తమ తమ సిద్ధాంతములను సమాజ ములో నెట్లు వ్యాపింప జేయగలిగెడివారు ? యేసుక్రీస్తు తన సిద్ధాంతమునెట్లు సంఘమున కందించగలుగును ? బుద్ధ భగవానుడెట్లు ధర్మప్రబోధముచేయ గలుగును ? గురునానకు యెట్లు తన సిద్ధాంతమును స్థాపింపగలుగును ?

ఇట్లే యే మహనీయుని చరిత్ర పరిశీలించినను, తమ జీవితమెల్ల సమాజాభివృద్ధికై వినియోగించినట్లు కనిపించు చున్నదిగాని, మన సోమరిపోతు ప్రచారకులు చెప్పినట్లు మహారణ్య మధ్యములో జీవితము గడపినట్లు కనిపించదు. ప్రతిఉత్తమ సాధకుడును ప్రారంభమునం దేకాంత స్థల ములో నింద్రియ జయమును సాధించి, తిరిగి జీవితమెల్ల సమాజమునకై వినియోగము చేసినట్లు కనిపించుచున్నది. వేదాంతికి సమాజముతో పనిలేదనునది సత్యమైనచో, తైత్తిరీయ శిక్షావల్లిలో ధర్మమునుగూర్చి బాగుగ తెలిసికొని, ఆచరింపుచు ఇతరులకు బోధించు చుండవలయును. అట్లే సత్యమును గూర్చియు, తపస్సునుగూర్చియు, ఇంద్రియ స్వాధీనతనుగూర్చియు, ప్రపంచ వ్యవహార సంబంధమైన విద్యలనుగూర్చియు, కుటుంబ ధర్మములను గూర్చియు, బాగుగ తెలిసికొని ఆచరించుచు, ఇతరులకు బోధించు చుండ

వలయునని, యేల ఆదేశించి యుండును? ఇంద్రియ నిగ్రహపదమునకు, "ఇంద్రియములను శుష్కింపజేసి, నిరుపయోగమొనర్చుట" అను నర్థము జేయుటెంతటి యవివేకము. వైద్యుడు పాషాణాది వస్తువులను పుటము పెట్టుట, అందలి దోషములను నశింపజేయుటకేగాని వస్తువునే నశింపజేయుటకు కాదుగదా? అట్లే ముముక్షువు (ఆత్మశాంతిని గోరువాడు) ఆత్మశాంతికై చక్కని సాధనలతో ఇంద్రియములను స్వాధీనము చేసికొనుటయే యింద్రియ నిగ్రహమగునుగాని, యింద్రియములను నిరుపయోగము జేయుట యింద్రియ నిగ్రహముకాదు. దానిని ఇంద్రియ ధ్వంసమనవలయును. ప్రపంచ వ్యవహారములతో సంబంధములేక, సదా భగవ ధ్యానము చేయుచుండినచో, దేవుడు గ్రద్దనెక్కియో, యెద్దు నెక్కియోవచ్చి తన్నురక్షించునని సామాన్యుల అభిప్రాయము. వీరికి ప్రమాణగ్రంథములు, యడ్లరామదాసు, భద్రాది రామదాసు చరిత్రలు, లేక మహాభక్త విజయము, పాండురంగ మహాత్మ్యములు. వీరేనాడును హిందూ సనాతన సిద్ధాంతమును స్పష్టపరచెడి ఉపనిషత్తులను చూచియుండరు. వీరు ఉపనిషత్తులనే చూచియుండినచో, ఉపనిషత్తు లన్నియు,

1. నామరూప క్రియాత్మకమగు సమస్త ప్రపంచము దేనియందు తోచుచున్నదో, దేనియందు నిలచుచున్నదో, దేనియందు లయమగుచున్నదో అదియే నీ స్వరూపమనియు,
2. శరీరాకారముగ పరిణమించిన పంచ భూతములకును శరీరములకు వేరుగనున్న పంచభూతములకును, వాని

సమస్త ధర్మములకును కారణమైన చైతన్యమే నీ స్వరూప మనియు,

3. అజ్ఞానము మొదలు దేహపర్యంతముగల సమస్త పదార్థములు, పరస్పర వ్యభిచారులగుటచే మిథ్యలనియు, వాని యందస్తిభాతి ప్రియరూపమున అనుస్యూతమై యుండు శుద్ధచైతన్యమే నీ స్వరూపమనియు,

4. ఏది సృష్టికి పూర్వమే గలదో, యేది ప్రపంచ సృష్టిచే, సృష్టింపబడదో, యేది ప్రపంచ ప్రళయమున నశింపదో, అట్టి శాశ్వత పదార్థమైన సత్తయే, లేక శుద్ధచైతన్యమే నీ స్వరూపమనియు,

స్పష్టముగ నిరూపించుచుండగా నీవీ ప్రపంచకార్యములలో పాల్గొనక, సదా భగవంతుని స్మరించిన, అతడెక్కడ నుండియో వచ్చి రక్షించునని తలంచుట మూఢత్వము. ఉపనిషత్తుల వరకేల ? ఉత్తమవేదాంత ప్రకరణ గ్రంథములను కూడ నీ సోమరులు పరిశీలించియుండరు. వాల్మీకి మహర్షిచే రచింపబడి వేదాంత ప్రపంచమున ముఖ్యస్థాన మాక్రమించిన యోగవాశిష్ఠ రామాయణములో వశిష్ఠుడు, శ్రీరామచంద్రునకేమి బోధించెనో చూడుడు.

ప్రయత్నము వలననే కార్యసిద్ధి. బుద్ధిమంతులు ప్రయత్నముచేతనే కార్యము లొనర్తురు. కష్టములు వచ్చినప్పుడు దుఃఖించు బుద్ధిహీనుల నోదార్చుటకు మాత్రమే దైవశబ్ద ముపయోగ పడుచున్నది. నిజమునకు తనకంటె నన్యముగ దైవమెచ్చటను లేదు. చేసెడి పనులకు ఫలము

లభించినప్పుడు "ఈ పనికి ఫలము కలిగినది" అని చెప్పుట యే దైవము పేర ప్రసిద్ధి గాంచినది. దీనివలననే మూఢవ్యక్తులు భ్రాంతితో త్రాటియందు పాము నారోపించునట్లు దైవ మున్నాడని ఆరోపించుచున్నారు. శవముగాక ఈ ప్రపంచ మున ప్రయత్నించని దింకొకటి లేదు. ప్రయత్నమువలననే ఫలము లభించును. అందువలన తేలునదేమన దైవము నిష్ప్రయోజనము. స్వప్రయత్నమును వదలి యెవరో నన్ను ప్రయత్నింప జేయుచున్నారనెడి అనర్థకల్పనలు చేసెడి వ్యక్తిని దూరముగ పరిత్యజించుట మేలు. పనులకుపయోగ పడునవి బుద్ధి, దైవము అని రెండు - ఈ రెండును వేరైన దైవమును స్వీకరింపవలసిన పనిలేదు. ఈ రెండును ఒక్క టియే, దైవమును అనుసరించి బుద్ధి ప్రవర్తిల్లు చుండు నందువా ? మరి ఈ రెంటికిని భేదమేమున్నది ? అందువలన బుద్ధిగాక దైవమను వేరొకవస్తువున్నదని ఒప్పుకొననక్కర లేదు. సమానబుద్ధిబలముగల యిరువురు ఒకే ఫలమునంద ప్రయత్నింప, అందొకడు కృతకృత్యుడై, మరొకడు ఫలము నందుట తటస్థించనప్పుడు దీనికి కారణము దైవమేయని చెప్పనేల ? ప్రయత్నదోషమని నుడువరాదా ? ఇట్లనిన దోషమేమి? ఏదుర్మతులు, మూఢులు అనుమానించి స్థాపించిన దైవమున్నదని నమ్ముదురో వారు "దైవబలమున అగ్ని మమ్ముదహించదని" నిశ్చయించి మండుచున్న చితిలోపడు టుచితము. ఈ విధముగా 800 శ్లోకములతో ముముక్షువ్యవ హారమను పేర ప్రత్యేకమొక ప్రకరణమునే వాల్మీకి రచించి నాడు.

ప్రకరణగ్రంథము లేకాదు. సర్వసామాన్యముగా ముముక్షువులెల్లచేతను పారాయణ చేయబడుచున్న భగవద్గీతలో శ్రీకృష్ణుడు, మానవులు తాము చేయవలసిన పనులు చేయకపోవుటచేతను, వేషధారణచేతను, ముక్తిని అనగా ఆత్మశాంతిని పొందలేరనియు (అ 3 శ్లో 4) పనిచేయకుండ ఒక్కక్షణమైన నేప్రాణియు నుండజాలదనియు ప్రతివాడు తన స్వభావానుగుణ్యమైన పనినిచేసియేతీరవలయుననియు (అ3శ్లో5) ఎవ్వడు నాటి సమాజాభివృద్ధికి సంబంధించిన కార్యక్రమములో పాల్గొనడో, అట్టివాడు కేవలము దుఃఖము లనుభవించుననియు (అ 3 శ్లో 16) గొప్పవాడనుకొన్న వ్యక్తియే పరుల కష్టార్జితమును తినుచు, సోమరిజీవితము చేయుచున్నచో, వారిననుసరించి సమాజముకూడ పతనమగుననియు. (అ 3 శ్లో 21-22) ఎవ్వరైతే నా యీ ప్రబోధమును అలక్ష్యముచేయుదురో వారు కేవలము మూర్ఖులు, బుద్ధిహీనులు, మోసకారులు, స్వార్థులనియు స్పష్టముగ నిరూపించుచున్నాడు.

కొందరు శుష్కవేదాంతులు 18 వ అధ్యాయములోని 21వ, శ్లోకము [1] నుదహరించుచు యంత్రగాడుబొమ్మల నాడించు రీతిగా ఈశ్వరుడు జీవుల నాడింపుచున్నాడని రుజువుజేయ సాహసించెదరు. జీవుల నడిపించువాడు ఈశ్వరుడైనచో, జీవుల పాపపుణ్యములకు ఈశ్వరుడే బాధ్యుడుగాని జీవులెట్లగుదురు ? చేయించువాడు ఈశ్వరుడైనప్పుడు, తప్పుజేసిన

---

[1] ఈశ్వరస్సర్వభూతానాంహృద్దే౽ర్జునతిష్ఠతి
భ్రామయన్ సర్వభూతాని, యంత్రారూఢానిమాయయా

వారిని దండించుట కధికారమేమున్నది? ఈశ్వరుడే చేయించి నప్పుడు నే నేమి చేయగలనని మహాపాపిసైతము సమాధాన మిచ్చును. ప్రేరణకర్త ఈశ్వరుడని అంగీకరించినచో, దుష్ట ప్రవృత్తిని సైతము నిరోధించుటకు మానవుడు ప్రయత్నము చేయుటే అపరాధమని రుజువగుచున్నది. కారణ మేమనగా; ఈశ్వరుడంతటివాని ప్రేరేపణను నిరోధింప ప్రయత్నించుట ఈశ్వరున కపరాధము చేయుటేగదా? ఈశ్వరు డాడింపుచున్నాడను వాదనలో నెంతటి అనర్థకమున్నదో ఆలోచింపుడు. ఇదేవిధముగా గీతలో నిటువంటి శ్లోకములను కొన్నిటి నుదహరించుచు, సోమరిజీవితమున కలవాటుబడిన శుష్క-వేదాంతులు దేవు డెచ్చటనో యున్నాడనియు, అత డెప్పుడో వచ్చి మిమ్ముల నుద్ధరించుననియు ప్రచారము చేయుచున్నారు. అట్టివారు మాహ్యాసాశ్రమభక్తులలో సైతమున్నారని చెప్పుటకు చింతిల్లుచున్నాను. శ్రీ సద్గురు మలయాళస్వాములవారి ప్రబోధములు సాకల్యముగ వినని వారును, వారి గ్రంథములను సైతము సాకల్యముగ చదువని వారును మాత్రమే యిట్టి ప్రచారములు చేయుచున్నారు. స్వాములవారి విషయములో నేమిచెప్పుచున్నారో చూడుడు.

"దైవమే ఈ సర్వప్రపంచమును అభివృద్ధి చేయునని నమ్మి కూర్చున్నవాడు, అడవి మనుష్యునకు అన్నయో తమ్ముడో యగుననియు, దైవమే అన్నిటి నొనర్చునను మూఢనమ్మకముగల దేశము అడవిగనో, యెడారిగనో ఉండి పోవుననియు, భారతీయులు ప్రయత్నహీనులై పోవుటచేతనే, నేడు బట్టలు, కలములు, పెన్సిళ్ళు, కాగితములు, వంట

పాత్రలు కడకు సంభాషణ కవసరమగు మాటలకు సైత మితర దేశములపై నాధారపడవలసి వచ్చినదనియు, ఒకా నొకప్పుడెప్పుడో మంచికాల మొకటి వచ్చుననియు, అప్పు డొక దివ్యపురుషుడు వచ్చి రక్షించుననియు నమ్మి కూర్చు న్నచో, అది కేవలముమూఢత్వమనియు, అవి కేవలము కల్పనా కథలనియు, పురాణములలోని కథల నుదాహరణగా తీసి కొనుట అవివేకమనియు, పురాణములలో గోలీలంత సత్య మున్నచో కొండలంత అసత్యము లున్నవనియు, మన భారతీయుల నీ యంధవిశ్వాసమే పాతాళమునకు పడద్రోసిన దనియు, మీ ప్రయత్నములవల్లగాక, యెప్పుడో, యెవ్వరో అవతరించి ఉద్ధరింతురని మీరు స్వప్నములో కూడ తలచ రాదనియు స్పష్టపరచినారు" (ధర్మసేతువులోని భావ శుద్ధియే జ్ఞానశుద్ధియను వ్యాసమునుండి) దేవతలను, అవ తారములను కల్పించిన మన భూదేవులు కాలమునకు కూడ కొన్ని హద్దులు నిర్ణయించినారు ఈ బ్రాహ్మణ బ్రువుల సిద్ధాంతము ప్రకారము కృతయుగము మాత్రమే సంపూర్ణ ధర్మములతో ప్రవర్తించునట. తదితర యుగములన్నియు కొంతకొంత ధర్మలోపముగనేయుండునట. ఆకృతయుగము వచ్చుట కింకను 570952 సంవత్సరములు పట్టునట. అంత వరకు లోకమెల్ల అధర్మప్రవర్తనలతో దుఃఖములను పొందు చుండునట. ఈ ప్రబోధములను నమ్మియే నేటి భారతదేశ పరాధీనతకు కారణము కలి ప్రభావమని నమ్మువారు విద్యా ధికులలో సైతమనేకమంది మనలో కలరు. కృతయుగము వచ్చువరకు అనగా 570952 సంవత్సరముల వరకు దేశములో

శాంతియుతమైన ధర్మప్రవర్తన. అలవడదనుట ఎంతటి అవివేకమో, అసందర్భమైన సిద్ధాంతమో తెలిసికొని, యిట్టి స్వార్థకాముల ప్రచారములను ఖండించి, ప్రయత్నములను బట్టియే ఫలితమేర్పడుననియు, ప్రపంచవ్యవహారములను విడచుట సోమరులకర్తవ్యమనియు, సమష్టి ప్రపంచాభివృద్ధికై సదా ప్రయత్నించుటే మానవకర్తవ్యమనియు హిందూ మత సిద్ధాంతమని, తెలిసికొన గోరుచున్నాను.

---

# యుగములననేమి?

హిందూజాతి పతన కారణములలో ఈ యుగముల పిచ్చి నమ్మకమొక ప్రధానకారణమనిన అతిశయోక్తి కానేరదు. యుగముల మార్పునుబట్టి గుణముల మార్పులు గలుగునను వెఱ్ఱినమ్మకమొక్క హిందూజాతిలో తప్ప ప్రపంచ ప్రజలలో మరేజాతిలోను కన్పించదు.

హిందూ ధర్మశాస్త్రములు, యుగములునాలుగనియు, అవి ఆ యా సమయములలో ప్రవేశించి తిరిగి ఆ యా సమయములలో పోవుచుండుననియు చెప్పినవని హిందూ జన సామాన్యమేగాక, పండితులలో సైతమీ వెఱ్ఱినమ్మకము బాగుగా నాటుకుపోయినది. అందుచేతనే నేటికిని ప్రతిహిందువు "కలియుగే ప్రథమపాదే" యని ప్రతినిత్యము సంకల్పము చెప్పునప్పుడు పఠింపుచు యుగముల లెక్కను అతిభద్రముగ జ్ఞప్తియందుంచుకొనుచున్నాడు. కృతయుగములో ధర్మము సంపూర్ణముగ అనగా నాలుగు పాదముల నడచుననియు, త్రేతాయుగములో నాల్గింట ఒక్కపాలు అధర్మము ప్రవేశించుననియు, ద్వాపరములో ధర్మమర్ధభాగ మడుగంటుననియు, కలియుగములో ధర్మమొక్కపాదమాత్రముగానుండి క్రమముగ నదికూడ నశించుననియు హిందువుల నమ్మకము. మన ధర్మనిర్ణేతల నిర్ణయము ప్రకారము జరిగిన 5048 సంవత్సరములుపోను, సంధ్య సంధ్యాంశలతో కలసి యింకను 5,70,952 సంవత్సరములీ కలియుగము జరుగవలసి యున్నది. అంతవరకీ ప్రజల ప్రవర్తన లీ క్రింది విధముగా నుండునని

పురాణములలో వ్రాయబడియున్నది. స్త్రీలను, బలహీనులను, బీదలను, తల్లి తండ్రులను హత్యజేయుచు సోమరులై యుండు వారు గౌరవింపబడుచుందురనియు, తండ్రి కుమారులు, సతిపతులు పరస్పరవంచకులై ప్రవర్తించెదరనియు, గురు శిష్యులు పరస్పర వంచకులగుదురనియు, ప్రజలు సదాకఱవు లచే పీడింపబడుచుందురనియు, ప్రజలు పట్టణములను పల్లెలను విడచి దుర్గమారణ్యములలో తలదాచుకొందురనియు, రాజులు పరస్పర ద్వేషములతోను, ప్రజలు పరస్పరపీడనములతోను, సంచరించెదరనియు, ఇట్లెన్నియో దురాచారములతో కలియుగ మెల్ల నడచునని వ్రాయబడియున్నది.

కలియుగమిట్టి అధర్మములతో నిండియుండునని వ్రాసిన మన ధర్మనిర్ణేతలు, ధర్మము నాలుగు పాదములతో నడచు నని చెప్పబడిన కృతయుగములో స్వభార్యయేకాక, రంభాది భోగకాంతలెందరో గలిగియు, పతివ్రతలను చెరచుటకై పరుగులిడు యింద్రుడేల పూజింపబడెనో వ్రాయలేదు. మరియు ఒక్కతండ్రిబిడ్డలైన దేవాసురు లాకృతయుగ ములోనే వందలాది సంవత్సరములేల ఘోరయుద్ధములు సలిపిరో చెప్పలేదు. ఆ యుగములోనే దేవగురువైన బృహస్పతి నిండుగర్భమును ధరించియున్న అన్న భార్యను ఆమెవలదన్నను వినక యేల వ్యభిచరించెనో తెలుపలేదు. ఆ యుగములోనే గురుద్రోహిగ చంద్రుడును, స్వేచ్ఛాచారిగ తారయునేల ప్రవర్తించిరో వ్రాయలేదు. ఆ సత్యయుగములోనే, యజ్ఞుడు తన చెల్లెలైన దక్షిణను, పృథుచక్రవర్తి తన సోదరి యగు అర్చిని వివాహమాడుటకు కారణము తెలుపలేదు.

ఆ యుగములోనే దేవతలెల్ల వందలాది సంవత్సరములు మహారణ్యములలో దాగుకొని "ఎన్నడు మాకు దిక్కుగల దెవ్వరు రక్షకుల"ని విలపించిరో తెలుపలేదు. ఆ ఉత్తమ యుగములోనే, సత్యాత్ములెవ్వరైన గలరా? యను ఇంద్రుని ప్రశ్నకు హరిశ్చంద్రు డొక్కడు మాత్రమేగలడని వశిష్ఠుడును, అతడుకూడ సత్యాత్ముడు కాడని విశ్వామిత్రుడును ఏల వాదులాడుకొనవలసి వచ్చినదో తెలుపలేదు. హరిశ్చంద్రుడుకూడ సత్యాత్ముడుకాడు. వరుణునితో అనేక పర్యాయములు అబద్ధ మాడినాడు. (భాగవతము నవమ స్కంధము.)

సుభిక్షముగా నుండు నా కృతయుగములోనే ఘోర కాటకమువల్ల ఆహారము దొరకక, కుక్కమాంసమైన తిని ప్రాణమును నిలబెట్టుకొనుటకై విశ్వామిత్రు డంతటివాడు అర్థరాత్రివేళ దొంగతనముగా మాలవాడలకేల పరుగిడెనో తెలుపలేదు. ఇన్నిమాటలేల? అధర్మము పెరిగినపుడు ధర్మమును రక్షించుటకై అవతరించెడి భగవంతుడు కృత యుగములోనే మత్స్య, కూర్మ, వరాహ, నారశింహ, వామనులుగా అయిదుసార్లు జన్మించుటలోనే ఆ యుగమెంత పాప భూయిష్టమైనదో స్పష్టమగుటలేదా? యుగములను బట్టియే ప్రజల నడువడికలుండుట నిజమైనచో, ధర్మము సంపూర్ణముగనడచు కృతయుగములో హిరణ్యాక్ష, హిరణ్యకశిపాది రాక్షసులుండుటకుగాని, ఘోరపాపములతో నిండి యుండునని వర్ణించిన కలియుగములో బుద్ధ, క్రీస్తు, శంకర, మహమ్మదు, రామానుజ, రామమోహన, రామకృష్ణ, దయా

నంద, వివేకానంద, మహాత్మాగాంధీలు జన్మించుటకుగాని వీలు లేదుగదా ? అంత దూరమేల ? ఒక్క యుగములో, ఒక్క కాలములో, ఒక్క రక్తసంబంధముగా, ఒక్క యింటిలో జన్మించిన, హిరణ్యకశిప, ప్రహ్లాదుల యొక్కయు, రావణ కుంభకర్ణ విభీషణుల యొక్కయు, కౌరవ పాండవుల యొక్కయు ప్రవృత్తులలో అంతటి వ్యత్యాసమేల యుండ వలయును ? అట్లే ఈ కలియుగములో ఒక్క కాలములో జన్మించిన కైజరులెనినుల యొక్కయు, హిట్లరు స్టాలినుల యొక్కయు, చర్చిలు గాంధీల యొక్కయు సిద్ధాంతములలో అంతటి వ్యతిరేకమేల యుండవలయును?

దీనిననుసరించి వారి వారి ప్రవృత్తినిబట్టియే వారివారి నడవడులు మారుచుండును గాని దీనికి యుగములతో సంబంధము లేదని స్పష్టపడుచున్నది. కృతయుగములో జన్మించిన చంద్రుడు గురుద్రోహి యగుటకును, కలియుగములో జన్మించిన వివేకానంద గురుభక్తుడగుటకును, అట్లే కృత యుగములో దేవతల కధిపతిగానున్న ఇంద్రుడు స్త్రీలోలు డగుటకును, కలియుగములో సామాన్యమానవుడుగా జన్మించిన రామకృష్ణుడు అఖండ బ్రహ్మచారి యగుటకును, కారణము వారి ప్రవృత్తులేగాని యుగప్రభావము కాదని స్పష్టముగ రుజువగుచున్నది. ప్రపంచ పరిస్థితులు యుగము లనుబట్టి యుండుటే నిజమైనచో, ఈనాడు రష్యా సర్వసమా నత్వముతోను, అమెరికా మహా భోగ భాగ్యములతోను, బ్రిటను ప్రపంచాధిపత్యముతోను, భారతాది దేశములు కొన్ని ఘోరదారిద్ర్యాదులతోను ఎందుకుండవలయును ?

ఈ వ్యత్యాసమునుబట్టియైన సమాజాభివృద్ధికి యుగముల సంబంధమేమాత్రము లేదనియు, సమాజైక్యతతో గూడిన ప్రయత్నబలముతోనే దేశమును స్వర్గతుల్యముగ జేయ వచ్చుననియు, స్పష్టపడుచుండగా, కృతయుగము వచ్చువరకు అనగా 570952 సంవత్సరములవరకీ బాధలు పోవనియు, అప్పుడెవడో పుట్టి సంస్కరించుననియు, అంతవరకు మీరు దానధర్మాదులు చేయుచు నుండుట తప్ప మరొక గత్యంత రము లేదనియు, చెప్పు ఈ దౌర్భాగ్య పౌరాణికుల అర్థ రహిత ప్రలాపములను హిందూజాతి తప్ప ప్రపంచమున మరేజాతియైన వినుటకైన సహించునా ?

నీచస్వార్థమునకులోనైన కొందరు బ్రాహ్మణబ్రువులు తమ జాతిని భూదేవకుమారులుగాను, పరాన్నభుక్తులుగాను జేయుటకై యిట్టి కల్పితార్థములను ప్రచారము చేసిరిగాని, నిజమునకు యుగశబ్దమునకీ అర్థము కానేకాదు. యుగశబ్దము నకు మనుమహర్షియేమి అర్థము చెప్పినాడో చూడుడు.

> "కృతంత్రేతాయుగంచైవ, ద్వాపరం కలిరేవచ
> రాజ్ఞోవృత్తాని సర్వాణి, రాజాహియుగముచ్యతే."

యుగమన రాజ శబ్దమునకు పర్యాయ పదమనియు, రాజుమార్పే యుగమార్పనియు తాత్పర్యము. చరిత్రాను భవముకూడ ఈ సత్యమునే బలపరచు చున్నది. అశోకుని కాలములో ప్రజలనుభవించిన సుఖములకును, ఔరంగజేబు కాలములో ప్రజలనుభవించిన దుఃఖములకును, అల్లెరష్యాలో జారుచక్రవర్తి కాలములో ప్రజలనుభవించిన దుఃఖములకును,

లెనిను, స్టాలినుల కాలములో ప్రజ లనుభవించిన సుఖముల కును, రాజుల ప్రవృత్తియే కారణముగాని, యుగముల కే విధమైన సంబంధము లేదని స్పష్టముగ రుజువగుచున్నది. సమాజము యొక్క ప్రయత్నములను బట్టియే యుగమార్పులు గలుగుచుండునని ఈ క్రింది శ్లోకము స్పష్టపరచు చున్నది.

" కలిః ! ప్రసుప్తోభవతి స జాగ్రద్వాపరం యుగం
కర్మ స్వభ్యుద్యతస్త్రేతా వి చరం స్తు కృతం యుగమ్".

అనగా ప్రయత్నమనునదియే చేయక సర్వము దేవుడే చేయునను గ్రుడ్డినమ్మకముతో సమాజము నిద్రావస్తనుబోలి యున్న కాలమునకు కలియుగమనియు, ప్రయత్నములతోగాని, ఫలితము లేర్పడవను జ్ఞానము కలిగిన స్థితికే ద్వాపరయుగ మనియు, ప్రయత్నములో నిమగ్నులై యున్న కాలమునకు త్రేతాయుగమనియు, ప్రయత్నములో సంపూర్ణ జయమును పొంది తత్ఫలితము ననుభవించు కాలమునకు కృతయుగ మనియు తాత్పర్యము. కృతమనిన చేయుటయని అర్థము. ప్రతివారు సదా ప్రక్కవాని క్షేమమును కోరుచు తన కర్తవ్యమును తాను విధిగా నెరవేర్ప వలయునను విజ్ఞానముతో సమాజము ప్రవర్తించు కాలమునకే కృతయుగమని పేరు. ఆ పరిస్థితిలో రాజుతో పని లేదనియు, ఆకాలమే ధర్మబద్ధ మైనదనియు, భారతకారుడుకూడ స్పష్టము చేయుచున్నాడు. [1] దీనినిబట్టి మార్క్సుచే నిర్ణయించిన సోషలిజమునకును,

1. విను తొల్లి కృతయుగంబున, మనుజులయెడ దండ నీతిమంతుండై రా జన నొకడు గలిగి యరయుట, మనుజేశ్వర లేదు ధర్మమతి మంద్రు తగన్.
భార. శాం. 2_188

హిందూధర్మ నిర్ణయకారులు చెప్పిన కృతయుగమునకును, ఒకే అర్థమని స్పష్టమగుచున్నది. దీనినిబట్టి చూచినచో, జమీాందారీ యుగమునకు (Fuedalism) కలియుగమనియు, నియంతృత్వయుగమునకు (Fascim) ద్వాపరయుగమనియు, పెట్టుబడిదారీయుగమునకు (Capitalism) త్రేతాయుగమనియు, ప్రజాసామ్యయుగమునకు (Socialism) కృతయుగమనియు నిర్ణయింపవచ్చును. ఈ నిర్ణయము ప్రకారము మనము కలియుగములోను (యింకను జమీాందార్లు, సంస్థానాధీశులు పోలేదుకాబట్టి) ఒకవిధముగా చూచినచో చైనా ద్వాపరయుగములోను, బ్రిటను త్రేతాయుగములోను, రష్యా కృతయుగములోను, నడచుచున్నదని చెప్పవచ్చును. ఒకే కాలములో ఒకే ప్రపంచములో పై నాలుగు తరగతులుగా సమాజముండుటకు కారణము, అచ్చటి ప్రజల ప్రయత్నము లేగాని, యుగములకు అవతార పురుషులకు నిందులో నేమాత్రము సంబంధము లేదని స్పష్టముగ రుజువగుచున్నది.

ఇప్పుడు మన కర్తవ్యమేమి? స్వర్గదేవతల సానుభూతికై వారిప్రతినిధులమని చెప్పుకొని తిరుగు భూదేవకుమారకులను దానాదులతో తృప్తిపరచి వారి ఆశీర్వాదములు పొందుచు కూర్చుండుటకాదు. స్వార్థపరులచే సృష్టింపబడిన, పురాణనీతులకు స్వస్తిచెప్పి, కలియుగములో నున్న అనగా జమీాందారీ పాలనలోనున్న భారతజాతిని కృతయుగములోనికి మార్చుట అనగా తాత్విక, సాంఘిక, ఆర్థిక, రాజకీయాదులలో సర్వమానవులకు సమానమైన హక్కును గలిగించుట. ఈ స్థితి ఉపన్యాసములతోనూ, తీర్మానముల

తోనూ అగునదికాదు. అవతార పురుషుల యొక్కయు, యుగముల యొక్కయు పిచ్చి నమ్మకములను సమాజము నుండి తొలిగించుట. స్వర్గదేవుళ్లు కలరనియు, వారెప్పుడో వచ్చి రక్షించెదరనియు నమ్మెడి అమాయక ప్రజానీకములో ప్రచారము జేయుచు పొట్ట నింపుకొనజూచు పౌరాణిక జాతిని, శుష్కవేదాంత ప్రచారకులను బహిష్కరించుట. ఈ బహిష్కరణ శాసనము చేయించుటకై ప్రభుత్వముపై ఒత్తిడి తెచ్చుటముందుగా చేయవలెను. ఇంతటితో మన బాధ్యత తీరలేదు. కలికాలములో (జమీందారీ పాలనలో) నున్న భారతావనిని కృత యుగము (ప్రజాస్వామ్యము) లోనికి మార్చుట కిష్టపడనివారు పౌరాణిక, శుష్కవేదాంతులేకాదు, జమీందారులు, పెట్టుబడిదారులు, భూస్వాములుకూడా ప్రతిఘటించెదరు.

కాబట్టి వీరితోకూడ పోరాడవలసిన పనియున్నది. ఈ పని సామాన్యముకాదు. తాత్విక, సాంఘిక, ఆర్థికరంగములలో సమత్వము తెచ్చుటకై ప్రయత్నించు మహాత్ములు, పట్టపగలు అతిఘోరముగ హత్యజేయబడినారు. దీనినిబట్టి యెటువంటి పరిస్థితినెదుర్కొన వలసియున్నదో ఆలోచింపుడు. ప్రజానుభూతికై పనిజేయజూచువారీ రంగములో అడుగు పెట్టుటకుకూడ అనర్హులు. ప్రాణములను పువ్వులవలె సమష్టి సమాజక్షేమమునకై అర్పించు త్యాగులే దీని కర్హులు. త్యాగధనులకు పుట్టినిల్లయిన భారతదేశములో నట్టి యర్హతగల వారెందరో సోదర సోదరీమణులలోగలరని నా నమ్మకము.

అట్టివారినీనాడు భారతమాత కోరుచున్నది. ఒకప్పుడన్నిరంగములలోను అసమాన గురుస్థాన మాక్రమించిన భారతమాత ఈ నాడు చెప్పనలవిగాని మూఢ నమ్మకములతోను, ఘోర దారిద్ర్యముతోను, క్రుంగి కృశించుచున్నది. అట్టి మాతృదేవిని తిరిగి యథాస్థితిలోనికి తీసికొని వచ్చుటకై సర్వమానవులు ప్రతిజ్ఞ చేయవలయునని కోరుచున్నాను.

---

# సత్యాహింసలననేమి?

సత్యాహింసలననేమి? వాని నేసమయములో నెట్లుప యోగింపవలయునను విచక్షణా జ్ఞానశూన్యతచేతనే భారత దేశ స్వాతంత్ర్యసూర్యు డస్తమించెనని చరిత్ర స్పష్టపరచు చున్నది. హిందూజాతి పతన కారణములలో నొకటగుటచే నీ సత్యాహింసల నిర్ణయమునుగురించి ఈ ప్రకరణలో చర్చింపుచున్నాను.

ఒకడు సత్యాత్ముడనియో, అహింసాపరుడనియో, విన్నప్పుడు వానిపై ప్రజలకు గలుగు గాఢానురాగమును బట్టియే సత్యాహింసల అపారగౌరవము వ్యక్తమగుచున్నది. అట్లే ఒకడు అసత్యాత్ముడనియో, హింసాకారుడనియో విన్నప్పుడు సమాజములో వానిపై గలుగు అసహ్యతను బట్టియే, హింసాసత్యములకున్న నీచత్వము స్పష్టపడుచున్నది.

ఈ కారణములచే, తీవ్రముగ నిరసింపదగు చెడుగు లలో యుద్ధమునకు మించిన చెడుగు మరొకటుండ దనుట నిర్వివాదమైన విషయమైనను, మానవ ప్రకృతి మారనంత వరకు, అనగా స్వార్థపరత్వము, ఈర్ష్య, లోభము, అహం కారము మారనంతవరకు, యుద్ధములు తప్పనిసరిగ వచ్చుచునే యుండునని స్పష్టపడుచున్నది. చూడుడు.

సహజశాంతికాములగు ద్రావిడులకు సైతము, దురా క్రమణ బుద్ధితో పైబడిన ఆర్యులతో యుద్ధము చేయక తప్పలేదు. అత్యుత్తమ సిద్ధాంతములతోగూడిన గీతా

ప్రబోధ కర్తయగు శ్రీకృష్ణుడంతటివాడు భారతయుద్ధ ప్రేరకుడై పదునెనిమిది అక్షోహిణీల సైన్యమును చంపించెను. దానినిబట్టి ఒకడు స్వార్థపరుడై దురాక్రమణకు గడంగినప్పుడు మరొక డెంతటి అహింసా పాలకుడైనను ప్రతీకారమునకు దిగక తప్పదని స్పష్టపడుచున్నది. తపోభూమి యనియు, ఆధ్యాత్మిక కేంద్రమనియు, ప్రఖ్యాతిగాంచిన మనభారతావనిలో నిట్టి సంఘటన లెన్నియో జరిగినవి. ప్రతాపుడు, దుర్గాదాసు, హమీరు, రాజసింగు, పృధ్వీరాజు, శివాజీ, లక్ష్మీభాయి మొదలగు వారేల అంతటి ఘోరయుద్ధములు చేయవలసి వచ్చినది ? స్వార్థపరులై దురాక్రమణకు గడంగిన, గజిని, ఘోరి, ఖిల్జీ, లోడీ, పఠాన్, తైమూరు మొదలగు వారిని, బ్రిటిష్‌వంశస్తులను ప్రతిఘటించుటకేగదా ? దీనిని బట్టి స్వార్థకాములగు దౌర్భాగ్యు లెంతకాల మీప్రపంచమున జీవించి యుందురో, అంతకాల మీ యుద్ధములు తప్పవని స్పష్టపడుచున్నది.

ప్రపంచమే మిథ్యయనియు, అది నీ సంకల్పమాత్రమే యనియు నిరూపించిన వ్యాసాది మహర్షులే, పరొక ప్రక్క సమాజక్షేమమునకై క్షత్రియుల నెడి ఒక వర్గమును నిర్మాణము జేయుటయు, యుద్ధమరణము స్వర్గమని సిద్ధాంతము జేయుటయు, యుద్ధపద్ధతులను గురించి వర్ణించిన గ్రంథమును వేదము (ధనుర్వేదము) గా నంగీకరించుటయు చూడగా, ఋషులుసైతము సంఘశ్రేయస్సుకై యుద్ధము లెంత యవసరములని గ్రహించిరో వ్యక్తమగుచున్నదిగదా ! మన భారతీయుల యుద్ధనైపుణ్యమునుగురించి, భారత, రామాయణ,

భాగవత; పంచతంత్ర, చాణక్యనీతి, మొదలగు గ్రంథములను బట్టియేగాక, విదేశీయులగు మెరిసన్; ఫరియా - ఎ - సౌజా, విల్సన్, హెచ్ - హెచ్ - విల్సన్, కర్నల్‌టాట్, మొదలగు మేధావుల ప్రశంసలను బట్టియు గ్రహింపవచ్చును.

భారతీయులు ప్రసిద్ధమైన యుద్ధనైపుణ్యముగల వారగుట నిజమైనచో, ఇతరులకెట్లు బానిసలైరను ప్రశ్నకు కర్నల్ టాట్ ఈ క్రిందివిధముగ జవాబు చెప్పుచున్నారు. "ప్రణయములోను రణములోను పాడిదప్పుటయనునది లేదు." అను నీతిసూత్రమును ఇతర దేశీయులు పాటింతురుగాని, హిందువులకిది సరిపడదనియు, పాదములపై బడిన శత్రువును సైతము విడిచిపుచ్చుటయే హిందూవీరుల మతమనియు, ఇట్టి ధర్మసూత్రముల పాటించుటలో వీరు మితిమీరి ప్రవర్తించిరనియు వ్రాయుచు, హిందూవీరులు దీర్ఘవిచార శూన్యులై పదే పదే దయదలచుచూ వచ్చిరిగాని, లేకున్న మొగలాయి లింతకాలము అడుగంటక నిలువజాలరనియు, హిందువులు తమ పౌరుషమునకు, ధర్మబద్ధత కొక్కింత రాజనీతిని, యుక్తాయుక్త జ్ఞానమును, సమన్వయము జేసుకొని ప్రవర్తించి యుండినయెడల, భారతీయులకీ దుర్గతి పట్టెడిది కాదనియు చింతించినాడు.

నిజమునకు భారతీయులు, హింసాసత్యములు ఘోరపాతకములను ఆధ్యాత్మిక ప్రవాహములో బడి, యుద్ధమర్యాదలను సైతము అతిక్రమించి, సత్యాహింస క్షమాగుణములకు మితిమీరిన ప్రాధాన్యత నిచ్చుటచేతనే, మన దేశమునకీ

అధోగతి గలిగినదనిన అతిశయోక్తి కానేరదు. నిజమునకు గజనీ మహమ్మదు ననేకసార్లు క్షమించి విడిచిన ఫలితమేగదా! నేటి మన భారతదేశ బానిసత్వమునకుగల ప్రధానకారణము? క్షమాగుణము పవిత్రమైన దైనను, దానికికూడ శాస్త్రమొక హద్దు నిర్ణయించినది. కర్నల్‌టాట్ చెప్పినట్లు ఆధ్యాత్మిక ప్రవాహములో మునిగిన, మన భారతీయ వీరులా హద్దును కూడ నతిక్రమించిరి. క్షమను గురించి భారతకారుడేమి చెప్పు చున్నాడో చూడుడు.

క. క్షమమేలగు నైనను నతిక్షమ దైన్యముదెచ్చు, నెదురు గర్వించిన గయ్యము, వాడిచి గెలిచి, యరి శేషమునెడ సదయాక్షమావిశదుడగుటొప్పున్.

క. తెగతీర్పక తగనార్పక తెగటార్పక కడమకొంత ద్రిక్కఁగ నున్నన్ । జగదీశయుప్పునగ్నియు, పగయునుకడు బెరుగు గీడువాటిల్లుతుదిన్.

దీనినిబట్టి మన భారత వీరులు యుద్ధనీతికి సైతము విరుద్ధముగ నడచిరనిన అతిశయోక్తికానేరదు. హిందూసిద్ధాంత ప్రకారము, అనృతమాడకుండుట సత్యమూకాదు, హత్య జేయకుండుటే అహింసయూకాదు. సత్యస్వభావమునుగురించి భారతకారుడేమి చెప్పుచున్నాడో చూడుడు.

సీ. సత్యంబుపలుకుట, సర్వధర్మములకు
మిక్కిలి అసత్యంబు, మేటిపాత
కముతద్విశేషము, గలదుచెప్పెదనొరు
నర్థంబు ప్రాణంబు, నపహరింప

జూచు పాతకులతో సూనృతంబాడుట
పాపంబు బొంకులు, పలికియట్టి
వారిహింసించుట వరధర్మమిది యొక్క
టేల భూతములకు, హితముసేయు
బొంకులెల్లను ధర్మముల్ భూతబాధ
కంబులగు నిక్కములు పాతకములు వినుము
భూతముల దుష్టత్వములు వివేక
సూక్ష్మతా వేద్యములు వాని జూడవలయు.

దీనినిబట్టి సమాజమునకు మేలుకలిగించు అనృతములు పుణ్యప్రదములనియు, నష్టము గలిగించు సత్యములు పాతకములనియు స్పష్టపడుచున్నది. అహింస విషయములో కూడ భారతకారుడేమి చెప్పుచున్నాడో చూతుము.

క. న్యాయమున సంగరంబుం జేయుగ శస్త్రాగ్నిదన్ను బొందిన దానం । గాయంబువిడచు పురుషుడు వేయేటికి మోక్ష లక్ష్మి విభుడగునధిపా.

క. శాంతుడుగాకని ఆయుధవంతుండై గవియు విప్రువసుధేశు డువే । దాంతినైనహింసించుట యెంతయు ధర్మము శ్రుతులు నిట్లని చెప్పున్.

ఇంత స్పష్టముగ అహింసా లక్షణములను భారతకారుడు చెప్పుచున్నను, విరోధినిసైతము చంపుటయు, చంపుటవరకేల ? కఠినముగ మాటాడుటయు, ఘోరపాతకమని నమ్మువారనేకులు గలరు. వీరిలో చాలమంది మహాత్మా గాంధీగారే యిట్లు చెప్పిరని వాదించుచుందురు. ఒక ప్రాణిని

చంపుటయే హింసయని మహాత్ముడెప్పుడును చెప్పలేదు. వారట్లు చెప్పుటయే నిజమైనచో, అహమ్మదాబాదు మునిసిపాలిటీవారికి వీధులలో తిరుగు కుక్కలను చంపవచ్చునని యెట్లు సలహా నిచ్చును ? ప్రాణావశిష్టముగు గోవును చంపుట కెట్లొడబడును ? ఆశ్రమములోని చెట్ల కాయలను పాడుజేయు కోతులను బంధించుట కెట్లంగీకరించును ? దౌర్జన్యపరులను అహింసతో నెదుర్కొను నైతికబలము లేనప్పుడు హింసతోనైన, నా దౌర్జన్యము నెదుర్కొనకుండుట పిరికివాని లక్షణమని యెట్లు ప్రకటించ గలుగును ?

మహాత్ము డనుసరించిన సత్యాహింసల సిద్ధాంతమునకును, ఎట్టి విరోధినిగాని, క్షుద్రజీవినిగాని హింసజేయుట, చేయించుట, ఒరులు చేయుట చూచి సంతోషించుట, చేయ సంకల్పించుటకూడ, ఘోరపాతకమని ప్రచారము జేసిన జిన, గౌతమబుద్ధుల సిద్ధాంతములకును, యేవిధమైన సంబంధము లేదని పై సంఘటనలు మనకు స్పష్టపరచుచున్నవి. మహాత్ముడు హింస నంగీకరించినచో, తన ఉద్యమముల నహింసాసిద్ధాంతముతో నేల నడపినాడని ప్రశ్నించువా రనేకులు గలరు. నాటి భారతదేశ పరిస్థితులను బట్టియే వారట్లాచరించిరిగాని బుద్ధుని సిద్ధాంతమును నమ్ముటచే కాదని చరిత్రను బట్టి రుజువగుచున్నది.

రవి అస్తమించని సామ్రాజ్యాధి పతుల చేతులలో చిక్కిన, నిస్సహాయులగు ముప్పదిమూడుకోట్ల భారతీయులలో, జాతీయ చైతన్యమును తీసికొనివచ్చుట కానాడంత

కన్న పదునైన ఆయుధము మరియొకటిలేదు. దేశ విముక్తికి విప్లవమును తీసికొని వచ్చుటకై హింసా విధాన మవలంభించిన కొద్దిమంది విద్యార్థులను, నిర్దాక్షిణ్యముగ శిక్షించుచు, వీరిని బందిపోటు దొంగలుగా, సామాన్య ప్రజానీకములో తప్పుడు ప్రచారముచేయుచు, బ్రిటీష్ప్రభుత్వము చాకచక్యముతో సామ్రాజ్యమును పిడికిలిలో పట్టుకొని కూర్చున్న రోజులవి. ఆ పరిస్థితులలో మహాత్ముడు భారతీయ రాజకీయరంగములో కాలిడినాడు. కొలదిమంది విద్యార్థుల ఆవేశముతో, దేశవిముక్తి కాదనియు, ముక్కోటి ప్రజలలో జాతీయచైతన్యము గలిగిననాడే బంధ విముక్తికాగలదనియు గ్రహించినాడు. అపారమైన ఆయుధబలముతో రాజ్యపాలనముచేయు నీ బ్రిటీష్ రాజకీయ దురంధరుల కంటియెదుటనే ముప్పదిమూడుకోట్ల ప్రజానీకములో ధైర్యోత్సాహములను గలిగించు మార్గములను పరిశోధించి, ప్రపంచమున ఏకాలమున, ఏనాయకుడు ప్రయోగించని సత్యాగ్రహాస్త్రమును ప్రయోగించినాడు. తద్వారా 1919, 21 ఉద్యమముల వలన విద్యార్థులలోను, 1930 ఉద్యమము వలన మధ్యరకపు ప్రజానీకములోను, 1932 ఉద్యమమువలన సామాన్య ప్రజానీకములోను, 1940 ఉద్యమమువలన నావిక, వైమానిక, కార్మిక, కర్షక, సైనికులలోను, సంపూర్ణ చైతన్యము కలిగించినాడు. దాని ప్రభావముచేతనే 1942 ఉద్యమములో అన్నివర్గముల వారును సంపూర్ణముగ పాల్గొన గలిగినారు.

ఒక్క విషయముమాత్రము జ్ఞప్తియందుంచుకొనవలయును. అదేమనగా, 1940 ఉద్యమము వరకు మహాత్ముడు

నడపిన ఉద్యమములన్నియు, ప్రజానీకములో చైతన్యమును గలిగించుటకేగాని, ప్రభుత్వమును పారదోలుటకు మాత్రము కాదనునది. ప్రజలలో పూర్తి చైతన్యముగలుగు వరకు హింస నేమాత్రము ఉపయోగించినను ప్రభుత్వము దానిని సాకుగాతీసికొని ఉద్యమమును, సమూలముగ కూలద్రోయ గలదని మహాత్ముడు బాగుగ గ్రహించినాడు. 1921 ఉద్యమములో చౌరీ చౌరాలో జరిగిన చిన్న హింసను కారణముగాతీసికొని బ్రహ్మాండముగ సాగిపోవుచున్న సత్యాగ్రహోద్యమమును నిలిపివైచుటకిదియేకారణము. ప్రజలలోపూర్తిగ జాతీయ చైతన్యము కలుగని కారణముచేతనే 1921 లో ఉద్యమమును నిలిపినాడుగాని, బుద్ధుని సిద్ధాంతమును నమ్మి మాత్రముకాదు. ప్రజానీకములో నన్ని వర్గములయందు సంపూర్ణ చైతన్యము వచ్చినదని నమ్ముటచేతనే, 1942 ఉద్యమములో, ఎవరి కేసమయములో నెట్లుతోచిన నట్లే శత్రువు నెదుర్కొనవలసినదిగా ఆజ్ఞాపించినాడు. దీనినిబట్టి మహాత్ముని సత్యాహింసలు భారతకారునికి సంబంధించినవో, గౌతమ బుద్ధునికి సంబంధించినవో ఆలోచింపుడు. అంతదూరమేల? మహాత్ముడు బుద్ధుని సిద్ధాంతము ననుసరించినచో, కాశ్మీరునురక్షించుటకై భారతసైన్యమును పంపించుట కెట్లంగీకరించును? అయినదానికి, కానిదానికి కూడ మన గాంధీగారు నేర్పిన సత్యాహింసలను మాత్రము మనము మరచిపోరాదని, ఉపన్యాసములిచ్చు కాంగ్రెస్ గోత్రీకులలో చాలమందికి మహాత్ముని సత్యాహింసలనుగురించి యేమియు తెలియదని సవినయముగ మనవిచేయుచున్నాను. ప్రపంచ

ము:లో బుద్ధ, క్రీస్తుల అహింసా సిద్ధాంతములు ఆచరణలో పూర్తి పరాజయము నొందినట్లు చరిత్ర తెలిసినవారికి తెలియును. ఈనాడు బుద్ధమతస్తులమని చెప్పుకొనువారు ప్రపంచములో 112 కోట్లమంది గలరు. క్రీస్తు భక్తులుకూడ కోట్లలోనే యున్నారు.

పశుపక్షి క్షుద్రజీవికి గాని అపకారము చేయరాదను బుద్ధుని సిద్ధాంతమును వారి శిష్యులమని చెప్పుకొను చైనా, జపాను, బర్మా, రంగూను, సయాము మొదలగు దేశీయులలో మాంసాహారము చేయనివారి నెందరిని చూపగలరు ? ప్రపంచాధిపత్యమునకై ప్రాకులాడు యూరప్ ఖండవాసులెల్లరు కుడిచెంపపైకొట్టిన ఎడమచెంప చూపుమనియు, పైవస్త్రము దొంగిలించినవానికి కట్టుధోవతి యియ్యవలసినదనియు ప్రబోధించిన, క్రీస్తుమహాశయుని శిష్యులేకదా ? బైబిలులోచదువుట తప్ప వారి అహింసను ఆచరణలోపెట్టిన శిష్యు నొక్కనినైన చూపగలరా ? హింస నేవిధముగ నంగీకరించని బౌద్ధ, క్రయిస్తవభక్తులెల్లరు హింసాకారులగుటయు, శత్రువులపై హింసా సత్యములను ప్రయోగింపవచ్చుననుహిందూమతస్థులు అహింసయని ధర్మపన్నాగములను చెప్పుటయు చిత్రముగానున్నది. హిందూ సాంప్రదాయములో హింస నిషేధింపబడినచో, తల్లినిచంపిన పరశురాముని అవతారపురుషునిగను, తండ్రినిచంపించిన ప్రహ్లాదుని మహాభక్తునిగను, అన్నకు ద్రోహముచేసిన విభీషణుని ఉత్తమ పురుషునిగను, పదునెనిమిది అక్షోహిణీలసైన్యమును చంపిన అర్జునుని ఉత్తమ వీరపురుషునిగను, స్త్రీనిజంపిన శ్రీరాముని యిల

వేల్పుగను, కోటిమంది సన్న్యాసులను జంపిన ఇంద్రుని స్వర్గాధి పతిగను, హిందూసమాజ మెట్లంగీకరించినది? సత్యమును గమనించక, అయినదానికి కానిదానికి కూడ ఈ సత్యాహింసల ప్రచారము జేయుమహానుభావులెందరో కాంగ్రెసులో చేరుట చేతనే "సత్యాహింసలలోని అర్థ మింతవరకొక్కరు కూడ గ్రహించలేదనియు" "సత్యాహింసలన నేమియో తెలియని పదవీవ్యామోహాపరులచే నేటికాంగ్రెస్ నిండి యున్నదనియు" మహాత్ముడు పలుమారులు ప్రకటించవలసి వచ్చినది. నిజమునకు 1942 ఉద్యమమువలనకూడ మనకు స్వాతంత్రము రాలేదు. యుద్ధపరిస్థితులవలన గలిగిన ప్రపంచ మార్పులచే మనకీనాటికి డొమినియన్ ప్రభుత్వమిచ్చుటకు బ్రిటిష్ ప్రభుత్వము తప్పనిసరియై అంగీకరించినది.

ఇంతటితో మనబాధ్యత తీరలేదు. పూర్ణస్వాతంత్రమును పొందుటకై మనమింకెన్నియో క్లిష్టపరిస్థితుల నెదుర్కొనవలసియున్నది. ఇప్పటికైన సత్యాహింసలన నేమియోచక్కగా అర్థముచేసికొనవలసిన బాధ్యత రాజకీయ ప్రవృత్తిగలవారికే గాక, ఆధ్యాత్మిక ప్రవృత్తిగల వారికికూడ ఎంతేనిగలదు.

ప్రపంచమును మిథ్యగాచూచుచున్న మాకీ ప్రపంచ వ్యవహారములతో పనిలేదను సాధువేషదారులీనాడు భారత దేశములో తక్కువలేరు. గీతా ప్రబోధకుడగు శ్రీకృష్ణుడు భారతయుద్ధమును నడిపించుటకును, సమర్థరామదాసు (శ్రీశివాజీగురువు) యుద్ధమును ప్రోత్సహించుటకును, ఈనాడు సహజానందాది సన్న్యాసులు రాజకీయ పోరాటములలో

పాల్గొనుటకును, అంతదూర మేల ? నేటి తెలంగాణా పోరాటములో స్వామిరామానందతీర్థులు పాల్గొనుటకును గల కారణము లీ శుష్క వేదాంత పశువులకు తెలియవు. ఇంత మాత్రమున జిన, గౌతమ బుద్ధుల అహింసా సిద్ధాంతములు నిష్ప్రయోజనమని మా సిద్ధాంతముకాదు. వ్యక్తిగతముగ ఆత్మశాంతికి కొంతవరకు పనిజేయవచ్చును. ఆచరణలో నదియు పూర్తిగ సిద్ధించదు. " జీవోజీవస్యజీవనమ్ " అను సిద్ధాంతమునుబట్టి ఒక్క నీటి చుక్కలో సైతము లక్షలాది జీవులున్నట్లు రుజువగుచున్నప్పుడు, పూర్తిఅహింస నాచరించ గలుగుటెట్లు ? ఇప్పటికైనభారతజాతి తాత్విక, సాంఘిక, ఆర్థిక, రాజకీయరంగములో సంపూర్ణమైన విజయమును సాధించదలచినచో, రాజకీయ ఆధ్యాత్మిక ప్రవృత్తిగలిగినప్రతివారు హింసా సిద్ధాంతము ననుసరించి సత్యాహింసల స్వభావ లక్షణములను బాగుగ తెలిసికొని పనిచేయవలసినదనియు, లేక మీ అంధవిశ్వాసములతో కూడిన సిద్ధాంతములను ప్రజలనెత్తిపై రుద్దదలచినచో శిథిలమై కృంగిపోనున్న ఈ భారత జాతిని మీాతరముతో మీా చేతులమీాదుగా సమాధి చేసిన వారగుదురనియు మనవిచేయుచు ఈ ప్రకరణమును ముగించుచున్నాను.

---

# భారత స్త్రీలు

ఏదేశము స్త్రీలను గౌరవించదో ఆదేశము శీఘ్రముగ పతనమగునను, మనుమహర్షి యొక్క సిద్ధాంతమునకు భారత దేశమే చక్కని తార్కాణము.

ఒకప్పుడు భారతదేశము అన్నివిషయములలో గురుస్థాన మాక్రమించుటకు గల కారణము, తాత్విక, సాంఘిక ఆర్థిక రాజకీయాదులలో స్త్రీలకుకూడ పురుషులతో సమానమైన హక్కు గలిగియుండుటయే ననియు, ఆ హక్కులను నాశనము చేయుటే నేటి హిందూజాతి పతనమునకు ముఖ్యకారణమనియు చరిత్ర వేనోళ్ల చాటుచున్నది.

స్త్రీలు విద్యల నేర్వరాదనియు, బాల్యవివాహములే శాస్త్రసమ్మతమనియు, స్త్రీలు వంటయింటి గడప దాటి బయటకు రాకూడదనియు, కొంతకాలము తల్లిదండ్రుల యొక్కయు, మరికొంతకాలము భర్త యొక్కయు, మరి కొంతకాలము కుమారుల యొక్కయు అధీనములో నుండవలయునుగాని స్వతంత్రముగా నెప్పుడు నెట్టిపనియు, మరెట్టి ఆలోచనయు చేయరాదనియు, మనభూదేవులు కల్పించి దాదాపు పదునైదు కోట్లమందిని ఎందుకూ పనికిరాని ఆటబొమ్మలుగా తయారు జేయుటచేతనే భారతజాతికీ హీనదశ కలిగినదనిన అతిశయోక్తి కానేరదు. ఔన్నత్యదశలో భారతమాత కొంతకాలమున్నదనిన స్త్రీలను సమానముగ గౌరవించుట చేతనేయని వ్రాసితిమికదా! ఆనాటి భారత స్త్రీ లెట్టిహక్కుల ననుభవించిరో చూడుడు.

ఋగ్వేదములోని 1వ మండలములోని 23వ అనువాక మందలి 179వ సూక్తమును లోపాముద్ర ప్రచారముచేసి నట్లును, ఎనిమిదవమండలములో ఒకటవ యనువాకమునందలి 91వ సూక్తమును అపాల యనునామె ప్రచారముచేసినట్లును, యాజ్ఞవల్క్యునితో వేయిమంది పండితులమధ్య ఆధ్యాత్మిక విద్యనుగురించి గార్గి శాస్త్రచర్చచేసినట్లును, అట్లే మైత్రేయి బ్రహ్మజ్ఞానమును భర్తద్వారా పొందినట్లును, చూడాల తన భర్తకే తాను వేదాంతము నుపదేశించినట్లును, జనకునంతటి రాజును సులభయను క్షత్రియకన్య ఆధ్యాత్మికసంబంధమైన ప్రశ్నలతో దిగ్భ్రమగలిగించినట్లును, మదాలస ఊయలలోని పసిబిడ్డలకే జ్ఞానోపదేశముచేసినట్లును, విక్రమార్కుని కాలములో మిహారునికోడలగు "ఖనా" జ్యోతిశ్శాస్త్రములో సాటిపండితులలో మేటియనియు, అట్లే లీలావతిచే రచింప ... గణితశాస్త్ర మితరదేశములలోసైత మీనాటికిని ·గణితమని పేరుతో ఖ్యాతిగాంచుచున్నదనియు, వ్యాస మునులంతటివారు భయపడిన మధ్యవర్తిత్వమును ఉభయ ·రతివహించి శంకర, మండన మిశ్రుల వాదములను పరి ·లించినదనియు, రఘునాధరాయలు రచించిన తెనుగు రామాయణమును మధురవాణి యనునామె సంస్కృతము లోనికి మార్చినదనియు, బౌద్ధభిక్షువులైన క్షేమ, ఉత్పలవర్ణ, విశాఖ, సంఘమిత్ర, లతాదేవులు సంఘమునకే ఆదర్శ ప్రాయులైరనియు, ఇంకను ఆధునికులలో మొల్ల, తరిగొండ వెంకమాంబ మొదలగువారెందరో విదుషీమణు లున్నట్లును స్పష్టపడుచున్నది.

అట్లే సత్యభామ దగ్గరనుండి, రుద్రమదేవి, ఝాన్సీ లక్ష్మీబాయి మొదలగువారెందరో కదనరంగములో ఖ్యాతి గాంచినట్లున్నది.

తగిన విద్యలుగలిగి అంగీకార యోగ్యమైన వరుడు దొరకనందుచే నేను ఆజన్మబ్రహ్మచారిగా నుంటినని సులభ జనకునితో చెప్పినదానినిబట్టి వివాహము చేసికొనుటకును, మానుకొనుటకును, స్త్రీలకు పూర్తిహక్కు గలదనియు, స్పష్ట పడుచున్నది. ఆనాడు బాల్య వివాహము లున్నట్లు చరిత్రలో నెచ్చటను కనిపించదు.

ఆనాడు అన్నిరంగములలోను అఖండ పాండిత్యమును సంపాదించి, సమానస్వాతంత్ర్యమును పొంది భారతమాతను ప్రపంచచరిత్రలో ప్రముఖస్థాన మలంకరింపజేసిన స్త్రీజాతి యొక్క సర్వస్వాతంత్ర్యమును ఏ విధముగా మన భూదేవ కుమారకులు నాశనముచేసినారో సశాస్త్రీయముగ నిరూపించిన వారు కీ. శే. కందుకూరి వీరేశలింగము పంతులుగారు, ఈశ్వరచంద్ర విద్యాసాగరులు మొదలగువారెందరో గలరు. ఆ మహనీయుల ప్రబోధముచేతనే ఈనాడు స్త్రీవిద్య మరల పునరుద్ధరింపబడుటయేగాక తాత్విక, ఆర్థిక, సాంఘిక రాజకీయ రంగములలోసైతము వారిని సమానముగ గౌరవించుచున్నారనుటకు, కొన్నిఉదాహరణ లీనాడు చూపవచ్చును. విజయలక్ష్మీపండిట్, సరోజనీనాయుడు మొదలగు కొందరు విద్యాధికుల నుదహరింపుచు ఈ నాడుకూడ స్త్రీలను సమానముగ జూచుచుంటి మనుకొన్నచాలదు. ఆర్థికముగా స్త్రీలకు

పురుషునితోపాటు సమానహక్కు గలిగిననాడే సమాజములో స్త్రీకి సమానగౌరవము లభించినదని తలంచవలయును. నేటి వరశుల్క, కన్యాశుల్కములు పూర్తిగ నిర్మూలనమైననాడే స్త్రీజాతి నిజమైన స్వాతంత్ర్యమును పొందబడిన దనవలయును.

స్త్రీలకు వేదకాలమున నెట్టిహక్కులు గలవను విషయమును, స్వామి దయానందులవారి "సత్యార్థప్రకాశిక" నుండియు, ఈనా డేవిధముగా నెందుకస్వాతంత్రలైరను విషయమును వీరేశలింగం పంతులుగారి గ్రంథముల నుండియు తెలిసికొని, సమాజములో నింతటి నాశనకర సిద్ధాంతములను ప్రవేశపెట్టిన మన సనాతన ఛాందసుల నీచప్రచారములకు స్వస్తిజెప్పి, స్త్రీలను సమానహక్కులతో గౌరవించి; ప్రపంచమున భారతజాతి తిరిగి పూర్వగౌరవ మర్యాదలను పొందునట్లుచేయుట, ప్రతి భారతీయుని ముఖ్య భాద్యతగా గుర్తించగలరని ఆశింపుచు ఈ గ్రంథము నింతటితో ముగించుచున్నాను.

*

# కర్తవ్యమేమి?

## సోదరా!

మన పూజ్య బాపుజీ మనకిక లేడు. ఒక మతోన్మాదిచే నిలువున హత్యచేయబడ్డాడు.

## ఓ హిందువుడా!

ప్రపంచ ప్రజానీకమున కాశాజ్యోతిగా ప్రకాశించు ప్రఖ్యాత ప్రవక్తలను మతోన్మాదముతో స్వజాతీయులే పొట్టను బెట్టు కొన్న ఘోరపాతకమున కొడిగట్టుకొన్న దౌర్భాగ్య జాతులు ప్రపంచములో రెండే రెండు. ఒకటి యూదజాతి. మరొకటి హిందూజాతి. పూజ్యతముడగు క్రీస్తు భగవానుని నిలువున కొరతవేసి ప్రాణములు తీసిన యూదులు నేటికిని నాదని చెప్పుకొనుటకు చారెడు నేలలేక ప్రతి దేశమునుండి తరుమ బడుచున్నారుగదా! ప్రపంచమున కాశాజ్యోతియు, శాంతి దూతయునగు మహాత్ముని, నిలువున హత్యజేసిన హిందూ జాతి యేమికానున్నదో ... ...

## రెండేమార్గములు:

ఒకటి హిందూమతాని కాచంద్రతారార్కముగ తీరని కళంక మాపాదింపజేసిన ఈఉన్మాద కారణములను పరిశీలించి తక్షణము సంస్కరించుకొనుటో? లేక 200 కోట్ల ప్రజానీకముచే నీచాతినీచముగ చూడబడుచున్న ఈ ఉన్మాద హిందూజాతికి చెందిన వాడనని ప్రపంచమునకు తెలియబడకుండ ప్రాణత్యాగము చేసికొనుటో?

## యేమిటి కర్తవ్యము ?

మూఢాచారములచే కలుషితమై, విషపూరితమై, ఉన్మాదియై, ఘోర పిశాచివలె వికటాట్టహాసము జేయుచు లోకపూజ్యుని ప్రపంచ ఆశాజ్యోతిని నిలువున హత్యజేసి యింకెన్నియో హత్యలకు దారితీయుచున్న ఈ హిందూ మతమున కావరించిన మూఢాచారములను ఉన్మాదచేష్టలను తక్షణము ధిక్కరించి, వేలాది సంవత్సరములు యే సిద్ధాంతముపై హిందూజాతి అఖండ ఖ్యాతి నార్జించినదో, ఆ సర్వమానవ సౌభ్రాతృత్వమును తిరిగి స్థాపించుటయా ? లేక మహాత్ముని భౌతిక దేహమును అగ్నికాహుతి చేసినట్లు, హిందూమతమును నీ చేతులార దగ్ధము జేయుటయా ? యేదిమార్గము ?

## హిందూజాతి కంతిమఘడియలు :

ప్రపంచమునకు వెలుగునిచ్చుచున్న భారతజ్యోతి స్వజాతీయులచే ఆర్పబడినది. నలుగడల కారుచీకట్లు కమ్ముచున్నవి. హిందూజాతి కంతిమ ఘడియలు ప్రత్యక్షమైనవి. తక్షణమే మనయొక్క నిర్ణయానికి రావలశియున్నది. సదాచారముల పేర జరుగు జాతి, మత, భేదములనునీ మూఢాచారములను తక్షణమే భూస్థాపితము చేయవలశియున్నది. సర్వ మత సమానత్వమును ప్రకటించవలసి యున్నది. హిందూజాతిలో ఈ రెండు పిశాచములు ప్రవేశించి నప్పటినుండియే హిందూమత పతనము ప్రారంభమైనది. అదియే క్రమక్రమముగా పైశాచిక రూపముదాల్చి మహాత్ముని తన పొట్టను బెట్టుకొన్నది.

**యింకనూ సందేహము దేనికి ? ఆలోచన దేనికి ? యిది ఆలోచనలకు సమయముకాదు.**

జాతి మత దురహంకార పిశాచి, సర్వమానవ సౌభ్రాతృత్వమునుచాటు లోకపూజ్యుని నిలువున హత్యజేసినది ప్రత్యక్షమేగదా ?

నీవింక యేమాత్ర మాలశించినను యిట్టి పవిత్రాశయములుగల మహనీయుల నెందరినో, తనపొట్టను పెట్టుకోగల దనునది ప్రతివారికి తెలిసిన నగ్నసత్యము.

## అంతిమ నిర్ణయము నీపైనున్నది :

హిందూజాతి సర్వ సమత్వమును ప్రకటించు జాతియని తిరిగి పూర్వస్థితిని రుజువుచేయుటో ?

మతోన్మాదమున నీ తరములో హిందూమతమను దానినే శాశ్వతముగా సమాధిచేయుటో ? అంతిమ నిర్ణయము నీదే.

## ప్రమాణపూర్వకముగ ప్రతిజ్ఞచేయుము ?

క్రీస్తు కుడిడొక్కలోనుండి కారిన పవిత్రరక్తమును చేరలబట్టి, మో కాళ్ళపైవంగి ప్రతిజ్ఞచేసిన యూరప్ ఖండవాసులవలె, తెలియని మతోన్మాదముతో పిశాచులమై మీ పవిత్రాశయములను లక్ష్యపెట్టక మిమ్ము నేకసార్లు ఉపవాసములు చేయించి వేధించితిమి. వేల సంవత్సరములనుండి పరదాస్యమను కారుచీకటిలో అల్లాడుచున్న మాకు మార్గము చూపుటకై అవతరించి, పిరికిపందలమైన మాకు అనేకవిధముల ధైర్యము కలిగించి కడకు స్వతంత్రమును చేకూర్చి దానిని చిరస్థాయిగ జేయుటకై సదా పరితపించు న్న మీ హృదయమును పిస్టల్ గుళ్ళతో బ్రద్దలుచేసి అణువణువున శాంతి శించు మీ పవిత్రరక్తమును యేరులై పారించిన దౌర్భాగ్య పిశాచ మారిపోయిన మా మహాపరాధములను క్షమించుము. ఓ ప్రభో ! నలుబది సంవత్సరములు సదా కంటికి రెప్పవలె రక్షించిన మీ ముచేసిన ఈ ఘోరతప్పిదమును క్షమించుము.

**మహాత్మా! ఈ క్షణమునుండి మీ రే ఆశయమునకై తమశ్వాస విడచువరకు పనిజేసినారో ఆ జాతికుల మత దముల మనఃపూర్తిగా నేను తర్పణ విడుచుచున్నా నని ప్రతి హిందువు తర్పణ విడువవలసి యున్నది.**

అట్లుగాక మన మెన్ని కర్మసాంప్రదాయముల ననుసరించి తర్పణలు విడిచినను, మహాత్ముని ఆత్మకు శాంతిలేదు. హిందూజాతికి బ్రతుకులేదు.

ఆలోచించండి! ఎవరితో?

ఈ మతోన్మాదముల కనుకూలములైన సిద్ధాంతములను చెప్పు ఛాందస పౌరాణిక జాతితో కాదు!

నీ అంతరాత్మతో.

ప్రతిజ్ఞ చేయండి! ఎక్కడ?

సభలలో, దేవాలయాలలో కాదు. ఏ జాతి, మత, కులస్తులను దూరముగ నుంచితివో వారి మధ్య.

స్థాపించండి! యేమిటి?

సిమెంటు విగ్రహాలను కాదు. మహాత్ముడాదేశించిన సర్వమత సామరస్య సద్భావ సంఘములను.

సదాజ్ఞప్తిచేసుకొనండి! దేనిని?

రామనామమునే కాదు.

మహాత్ముని హత్యజేసిన హిందూమతోన్మాద కా
ములను కూడా

ఇట్లు,
హృదయావేదనతో విన్నవిం
ఒక నిర్భాగ్య హిందూ పౌరు
ఆరుమళ్ల సుబ్బారె

తేల్రప్రోలు, P. O.
(కృష్ణాజిల్లా.)
31—1—1948.

శ్రీ పాండురంగ ప్రెస్, ఏలూరు. ప. సం. 27. 4-2-48/1000



## మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA124B159 |
| పుస్తకం పేరు | హిందూజాతి పతన కారణములు |
| తారీఖు | 29/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 77 |
| పెద్ద సైజు పేజీలు | 0 |
| ఖాళీ పేజీలు | 1,5A |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Rehana |
| పేజీలు విడదీసినది | Ruksana |
| స్కాన్ చేసినది | Prathyusha |
| పరీక్ష చేసినది | THASIN |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | |